

నవల :

# గోదావరి నా కన్నీరు

రచన :

చందు సోంబాబు

ముఖచిత్రం :

గోపి

సంచిక :

ఫిబ్రవరి 1980



సచిత్ర మాసపత్రిక
విజయవాడ-520 002.



# గోదావరి నా కన్నీరు

కెప్టెన్ మాధవ్ పేపర్లో ఓ ఫొటో చూసి ఉలిక్కిపడ్డాడు. తేరుకొని పరీక్షగా చూశాడు. ప్రముఖ నర్తకి, నాట్యరాణి 'జయ' నృత్య ప్రదర్శన, రవీంద్ర భారతిలో అని రాసివుంది.

జయ!

కెప్టెన్ మాధవ్ సిగరెట్ వెలిగించి మళ్ళీచూశాడు.

కాదు. ఆమె ముమ్మాటికి హేమ.

జయకాదు.

కోటిమందిలోవున్నా. ఏ పేరు పెట్టుకొన్నా ఆ రూపాన్ని తను గుర్తుపట్టగలడు.

"హేమ" ఇక్కడే వుందన్నమాట మనసులో అనుకొన్నాడు. ఆ క్షణంలో అతని గుండెలనిండా ఆనందం చోటు చేసుకొంది. ఎంతోకాలంగా అన్వేషిస్తున్న తన ప్రాణాన్ని తిరిగి పొందగలిగాడు, 'తనకదేచాలు' అనుకొన్నాడు.

అంతలోనే ఓ క్షణం అతని మనసు శంకించింది.

హేమ అసలు బతికుందా?

జయ, లిన హేమేనా?

తన కళ్ళు తనని మోసంచెయ్యలేవు. చిన్నతనంనించి మనసులోనూ, గుండెల్లోనూ నింపుకొని ఆరాధిస్తున్న తన ప్రణయ దేవతని గుర్తుపట్టలేకపోతే ఆ కళ్ళకి వెలుగున్నా ఒకటే లేక పోయినా ఒకటే.

ఇంతకాలం హేమ లేని జీవితం ఓటమి కూడలి అయి పోయింది. ఈ ప్రపంచంలోని విషాదమంతా తన నరనరాల్లోనూ చోటుచేసుకొని యాంత్రిక జీవనానికి అలవాటుచేసింది.

ఇంతకాలం చీకటినిండిన జీవితంలోకి వెలుగురాబోతుంది.

ఇప్పుడు పేపర్లో హేమఫొటోచూశాక ఓ క్షణం కూడా ఉండలేకపోతున్నాడు మాధవ్. ఆశలేని జీవితం నవచైతన్యాన్ని ఉంజుకొంది' పన్నెండేళ్ళ నిరీక్షణలో ఎలా వుండగలిగానా అన్న అనుమానం కలిగిందతనికి.

జయ....కాదు, హేమ.

తనని చూస్తే ఏంచేస్తుంది? పరుగెత్తుకొచ్చి తన కౌగిలిలో ఇమిడిపోతుంది.

పిచ్చి హేమ,

ఎలా వున్నావ్?

ఏం చేస్తున్నావ్?

తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు మాధవ్.

సెలవుల్లో వచ్చాడేకానీ, వచ్చింది మొదలు తల్లిపోరు ఎక్కువైంది, వెంటనే పెళ్ళిచేసుకోమని.

ఎప్పుడో మనసును పోగొట్టుకున్న తను ఎలా పెళ్ళి చేసుకోగలడు?

హేమ జీవితంలో తారసపడకపోతే తన ప్రేమ గుర్తుగా బ్రహ్మచారిగా మిగిలిపోవాలన్న నిర్ణయానికూడా అతనెప్పుడో వచ్చాడు.

ప్రేమపట్ల మాధవ్‌కి విశ్వాసముంది. అందుకే అతనిమనసు చెక్కు చెదరలేదు.

చేతిగడియారంలోకి చూశాడు మాధవ్.

అయిదుదాటింది.

గబగబ తయారై జావా మీద బయలుదేరాడు.

పది నిమిషాల్లో రవీంద్రభారతి చేరాడు మాధవ్. జనం తొక్కిసలాటగా వుంది రవీంద్రభారతి దగ్గర.

దాన్నిబట్టి జయ నాట్యంపట్ల ప్రేక్షకులకి గల అభిరుచి, అభిమానం అర్థం అయినయి మాధవ్‌కి.

ప్రోగ్రాం మొదలు కావడానికి ఇంకా అరగంట వ్యవధి వుంది. గ్రీన్‌రూంలో కెళ్ళి జయని వెంటనే కలుసు కోవాలన్న కోరిక అతనికి లేకపోలేదు. కానీ తనని చూసిన సంతోషంలో జయ సరిగా ప్రదర్శన ఇవ్వదనేఅనుమానం కలుగగా ఆ అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు మాధవ్.

ఈలోగా మాధవ్ మరికొన్ని విషయాలు తెలుసుకొన్నాడు. ప్రముఖ కళాకారిణి కళావతికి జయ ప్రథమ శిష్యురాలని. కళావతి నడిపే నృత్య కళానికేతన్‌కి జయవల్లనే పేరూ ప్రఖ్యాతి లభించాయని. అందుకే జయంటే కళావతికి పంచప్రాణాలని, విన్నాడు.

కళావతికి క్రమశిక్షణ ఎక్కువని, సంస్థని చాలా క్రమ పద్ధతిలో. చక్కగా గౌరవంగా నడుపుతోందని తెలుసుకొని చాలా, ఆనందపడ్డాడు మాధవ్.

మాధవ్ థియేటర్లో తనసీటులో కూర్చున్నాడు. మాధవ్ ఆలోచనల్లో వుండగానే హాలులో దీపాలు ఆరిపోయినయి. రంగ స్థలంపైన తెరతొలగింది. రంగుదీపాలమధ్య అంజలి ఘటిస్తూ జయ నించోంది.

మాధవ్ కళ్ళు విప్పారాయి. ఒక్క పరుగులో జయ ముందుకి పరుగుదీయాలనిపించిన కోరికకి అంతలోనే కళ్ళెం వేశాడు.

రంగస్థలంపైన తిలోత్తమలా మెరిసిపోతోంది జయ.

అందం, అందమంటే కేవలం తన హేమ. అందానికి నిర్వచనం తన ప్రేమ దేవత.

జతిస్వరం, తరంగం, భామాకలాపం ఒరసగాచేసింది జయ.

జయనేచూస్తున్న మాధవ్‌కి ఆ రెండుగంటల ప్రదర్శన రెండుక్షణాల్లో ముగిసినట్టనిపించింది.

మంత్రిగారి ప్రసంగం, జయని గురించిన ప్రసంగం లు అన్నీ ముగిసేక మాధవ్ గ్రీన్‌రూంకేసి కదిలాడు.

అక్కడొక ఆవిడ అజమాయిషీచేస్తు కంగారు పడిపోతూ విసుక్కొంటూ కోప్పడుతూ కనబడింది. ఆవిడే కళావతి.

మాధవ్ నవ్వుకొంటూ లోపలికి నడిచాడు.

జయ మేకప్ తీసేస్తోంది. మాధవ్ వెనగ్గావెళ్ళి నించున్నాడు.

అద్దంలో కనబడ్డ ఆకారాన్ని చూడగానే జయ కొన్ని క్షణాలు కదలికలేకుండా వుండిపోయింది.

గెడ్డంక్రింద కనబడే పెద్దపుట్టుమచ్చనీ, అతన్నీ చూసి. కళ్ళు పెద్దవిచేసింది. సంభ్రమాశ్చర్యాలతో వెనక్కి తిరిగింది.

విప్పారిన జయనేత్రాలు కొన్ని క్షణాలు రెపరెపలాడాయి. ఎర్రని చెక్కిళ్ళు మరిం తెర్రబడ్డాయి. పెదవులు అందంగా వణికేయి. అంతలోనే నల్లని కాటుక కళ్ళలో నీరు చోటుచేసు కొంది.

"హేమా !"అన్నాడు.

"మధూ !" అందో అడుగు ముందుకేసి.

"నీకోసం నే నొచ్చేశాను హేమా !" అన్నాడు.

"నీ ఈ పిలుపుకోసమే నేనింకా బ్రతికున్నాను మధూ !

అనాలనుకొంది.

"పద !" అన్నాడు.

జయకి మేకప్ తీసేయాలన్న ధ్యాసగానీ అక్కడ తనకోసం అందరూ ఎదురు చూస్తున్నారన్న సంగతిగానీ గుర్తులేకుండా పోయినయ్,

ఇద్దరూ కొన్ని అడుగులు వేశారు.

ఎదురు గావస్తున్న కళావతిని చూసి ఆగిపోయింది. కాళ్ళకి బ్రేకులుపడినట్టు,

"ఆగిపోయావే," అడిగాడు.

"నిన్నుచూసిన క్షణంలో నన్ను నేను మరచిపోయాను మధూ !

నన్నెక్కడికి తీసుకెళ్ళాలని ?"

"మనింటికి ?"

జయ అందంగా నవ్వింది.

"మేడమ్ వంపదు,"

"నేనడుగుతాను."

"ఉహూ, మెల్లగా నచ్చచెప్పాలి. ఇంతకాలం నన్ను ఓ అనాథగా అనుకొంటోంది. ఇప్పుడు నీ గురించి చెప్పినా నమ్మదు, క్రమశిక్షణ అవిడ మొదటి పేరు. ఆ పేరుని అతిక్రమిస్తే బయటికి పంపేస్తుంది."

"పంపనీ, మరీ మంచిది."

జయ నవ్వింది. తెల్లని పలువరుస ముత్యాల్లా మెరిసింది

నువ్వొస్తావన్న నమ్మకంతోనే నేను బతికున్నాను మధూ. నాట్యంపై నింత ఆసక్తిని పెంచుకొని ఈ స్థానాన్ని పొందింద కూడా నీకోసమే. ఏదో ఒక రోజు. ఏదో ఒక చోట ఎప్పుడో నువ్వు నన్ను కలుస్తావనే నమ్మకం. అంతే! లేకపోతే ఆడపిల్లని నువ్వెక్కడున్నావని వెతకను."

"హేమా!"

"నన్ను జయగానే పిలువు!"

"కానీ నువ్వు నా హేమవి."

"హేమగా నీకు దూరం అయ్యాను. జయగా నీకు దగ్గరయి నాను. అందుకే నేను జయని."

"అలాగే జయా."

జయని వదిలి వెళ్ళాలనిలేదు మాధవ్‌కి కానీ కళావతి దగ్గర కొచ్చేస్తోంది.

మర్నాడు ఎక్కడ కలుసుకోవాలో చెప్పి బయటకొచ్చేశాడు మాధవ్. అతను వెళుతున్నవేపే చూస్తూ నించుండిపోయింది జయ.

*　　*　　*

రాత్రి రెండయినా జయకి నిద్రపట్టలేదు. ఆరడుగుల మాధవ్ రూపం కళ్ళముందు కదులుతోంది.

మధు ఎంత మారిపోయాడు. ఇంతకాలం తను కన్నకలలు నిజం అయినాయి. మధు తనని మరచిపోలేదు.

తనెదురు చూసిన దేవుడు మధు. ఆశలు పెంచుకొన్నదే కానీ జయకి తెలుసు. ఇద్దరూ ఒకేవూళ్ళోపుట్టి పెరిగారు. ఇద్దరివీ పక్కపక్క ఇళ్ళు. బుద్ధి తెలిసినముందునించీ ఒకేమాట ఇద్దరిదీ. ఒక్కక్షణం విడిచి వుండలేని అనుబంధం వాళ్ళది.

చుట్టుపక్కలవాళ్ళు నవ్వుతూ అనేవాళ్ళు "పెళ్ళీడొచ్చేదాకెందుకు ఇప్పుడే పెళ్ళిచేస్తేసరి," అని.

ఉదయం లేచింది మొదలు ఒకరి చెయ్యి మరొకరి చేతిలో వుండవలసిందే.

బడికి కలిసివెళ్ళాలి. అమ్మ ఏదన్నా వెచ్చాలకోసం పంపిస్తే కలిసివెళ్ళాలి. గుడికి. రాజుగారితోటలో ఆడుకోటానికి, నేరేడు పళ్ళు ఏరుకోడానికి, చెరువులో మధు స్నానంచేయడానికి, సినిమాకి ఆఖరికి పందిరిలో హరికథ వినాలన్నా ఇద్దరూ వెళ్ళాలి.

జయకి ఓ చిన్న సంఘటన గుర్తుకొచ్చింది. వెంటనే పగులబడి నవ్వా లనిపించినా, అది అర్ధరాత్రి, అందరూ నిద్ర పోతున్నసమయం కావడంచేత, బలవంతంగా నవ్వుని ఆపుకొంది.

మధు స్నానం చెయ్యడానికి చెరువులోదిగాడు. తను ఒడ్డునే కాపలావుంది. అంతలోనే మధు నిక్కర్ నీళ్ళలో కొట్టుకు పోయింది. మధు పొట్టిచొక్కా తొడుక్కుని తనని అడ్డుపెట్టుకొని వంగివంగి ఇంటికి నడచివచ్చాడు,

అలాంటి మధు ఈ రోజున పెద్ద హీరోలా అయ్యాడు.

జయ మంచంపైన లేచికూర్చుంది. ఆలోచనలు తెగడం లేదు. ఆనందానికి అవధులులేవు.

"ఇదంతా నిజమా !"అన్న అనుమానం ఓ పక్క కలుగు తోంది. ఒక్కసారింత ఆనందం కలిగినా భరించడం కష్టమే.

ఇంతకాలం ఏదో ఆశతో బతికినా అది జీవచ్ఛవంగానే.

మధు తనని మరచిపోయాడేమోనన్న దిగులు. భయం, ఆరాటం' ఆవేదనా.

ఆలోచనలతో మనసుకాలిపోతోంది. గుండెల్లో అగ్ని పర్వ తాలు పగిలేయి.

అవన్నీ భరించి, బతికింది ఈ రోజుకోసమే.

"మధు"

"తన మధు"

తనకోసం వెదుక్కుంటు వచ్చేశాడు.

తనకి అంతకన్నా ఏం కావాలి? మధు చిన్నప్పుడు చాలా చిలిపిగా వుండేవాడు.

ఓసారిద్దరూ ఏవో సినిమాకి వెళ్ళారు.

మర్నాడు సాయంత్రం ఆడుకొంటుంటే గడ్డివాముచాటుగా వచ్చి తనని ముద్దుపెట్టుకొన్నాడు.

"ఛీఛీ, ఎంగిలి" అంది తను.

"నిన్న సినిమాలో ఇలాగే చేశాడుగా యన్.టి. రామారావు" అన్నాడు.

"అమ్మకి చెప్తానుండు."

"ఎవరికీ చెప్పొద్దు. నిన్ను పెళ్ళిచేసుకొంటాను అన్నాడు.

పెదవులపైన ఆ వయసులో అతనువేసిన ముద్ర, అన్న మాట. గుండెల్లో మిగిలిపోయినాయి, అందుకేనేమో తనింతకాలం అలా అతనికోసం ఎదురుచూడగలిగింది.

డయికి కళ్ళల్లో నీరు తిరిగింది. సరిగ్గా అప్పుడే మధు తండ్రికి హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ అయింది.

గూడు చెదిరింది. జంట తెగిపోయింది. ఒంటరిగా మిగిలిపోయిది.సులుగా ఏడుస్తు అతనులేని బతుకు తనెలా బతగ్గలదు?

"మధు నువ్వెళ్ళకు, నువ్విక్కడే వుండిపో" అంది ఏడుస్తు.

మధు తన కన్నీళ్ళు తుడిచాడు.

"హేమా, నువ్వూకూడా మాతో వచ్చెయ్. కలిసి బడి కెళ్ళొచ్చు. పెద్దయ్యాక పెళ్ళిచేసుకుందాం!" అన్నాడు,

వాళ్ళ అమ్మా నాన్నకీ చెప్పి చూశారు.

"మీకుంతలేకంతే ప్రసిడెంటుగారూ, మీ అమ్మాయిని మాతో పంపండి, పట్నంలో వీడితోపాటే చదువుకొంటుంది" అని.

"చిన్నతనంకదా ఏదో మందలాగే వుంటుంది. నాలుగు రోజులుపోతే వాళ్ళే అలవాటు పడతారు," అన్నాడు నాన్న.

"హేమ తెలివైన పిల్ల. శాస్త్రిలుగారు జోస్యంకూడా చెప్పారు. మంచి కీర్తిని ఆర్జిస్తుందని. ఇక్కడెలాగూ అవకాశాలు లేవు కనక మాతో పంపితేనాగుంటుంది," అన్నాడు మధు వాళ్ళ నాన్న.

"ఆడపిల్లలకి చదువు సంధ్యలెందుకండీ నాయుడుగారు మరో నాలుగేళ్ళుపోతే పెళ్ళిచేస్తాను," అన్నాడు నాన్న.

"నేను మధూనే చేసుకుంటాను." అంది తను గబుక్కున.

"నేను హేమనే చేసుకుంటాను" అన్నాడు మధు రిక్షాలో కూర్చుని. వాళ్ళిద్దరి మాటలికి అందరూ నవ్వేశారు.

మధూ వాళ్ళ రిక్షాలు కదిలాయి. రిక్షాలో కూర్చుని మధు ఏడుస్తూ చొక్కాతో కళ్ళు తుడుచుకుంటున్నాడు. తను రిక్షా వెన కనే కొంతదూరం పరుగెత్తుకెళ్ళింది. ఆరోజంతా గుడి మండపం పైన బోర్లాపడుకుని భోరుమని ఏడ్చింది. తనని పాలేరు అబ్బులు వచ్చి ఎత్తుకెళ్ళాడు ఇంటికి.

తరువాత బడికెళ్ళనని తోసింది. అందుకు ఇంట్లో ఎవరూ ఏమీ అనలేదు. పిచ్చిపట్టినట్టు, తనదగ్గర్నుంచీ ఏదో అమూల్య మైన వస్తువుని ఎవరో ఎత్తుకుపోయినట్టు, పసివాన్నన్న జాలి కూడ లేకుండా అందరూ కలిసి తనని ఏడిపిస్తున్నట్టు ఉక్రోషంగా వుండేది.

మధు తనూ కలసి ఆడుకొన్న చెరువుగట్టుకెళ్ళి గుడిమండ పం దగ్గరకెళ్ళి గంటల తరబడి కూర్చునేది. ప్రక్కన మధు వున్నాడన్న ధ్యాసతో ఒక్కోసారి అతనితోటి కుర్రాళ్ళతో ఆడు కొనేది. తనంతసేపూ ఆడుకొంది మధూతో కాదని తెలిసేక ఏడి చేది.

వాళ్ళని తిట్టి కొట్టి పంపేసేది. కానీ మధ్నాడు మామూలే పోనుపోను తననిచూస్తే భయపడేవాళ్ళు కుర్రాళ్ళు. ఆడుకున్నంత సేపు ఆడి తిరిగి తంతదేమోనని. తనకె మధూ అంటే అంత ఇష్టం మరి. అపపాదపపా అమ్మతో చీవాట్లు, దెబ్బలుకూడా అల వాటైనయి తనకి చేసే చిన్నచిన్న తప్పులకి.

పంచాయితీ ఎన్నికల్లో నాన్నగార్ని ఖూనీచేసి చంపేశారు. నాన్నగారికి మామయ్యకి మొదట్నించిపడదు. నాన్నగారు చని పోయినా మామయ్యరాలేదు. అమ్మే స్వయంగా అన్నీ పరిష్కా రాలు చేసుకొంది. కుటుంబానికి శని చుట్టుకుందని అమ్మ ఏడి ంది. ఆడపిల్లని పెట్టుకొని ఒంటరిగా ఎలా జీవితాన్ని సాగించా లని రోదించింది.

కానీ వారం తిరగలేదు.

ప్రకృతికి కోపమెత్తింది. విలయ తాండవం చేసింది. తుఫాను మొదలైంది. రోడ్డుమీదకొస్తే గాలివిసురుకుఎగిరపోతామా

అన్నంత గాలి, వాన.... చెట్లు కూలిపోతున్నాయి. పూరిగుడిసెలు కాగితాల్లా ఎగిరిపోయాయి. పాకయిళ్ళు పేకమేడల్లా కూలి పోయాయి. చెట్లపైని పక్షులు పండిన పళ్ళలా రాలిపోయినయి,

వాన....గాలి....గాలి....వాన....

ఏ క్షణంలో ఎవరియిల్లు కూలిపోతుందో తెలీని పరిస్థితి.. నిరాశ్రయుల ఆర్తనాదాలు పసిపిల్లల ఏడుపులు....

తనకి తెలీదప్పుడు. అదోవింతగా తోచింది. రెండురోజులు తన తీవ్రతని చూపిన తుఫాను, మరింతగా రెచ్చిపోయింది. బయటవరదనీరు పారుతోంది. చెట్లుకూకటివేళ్ళతో పెళ్ళగించుకొని పడిపోతున్నాయి,

ఎవరికీ కంటిపైన నిద్రలేదు. భయం. నిద్రపోతే ఏం జరుగుతుందోనని.

తిండిలేదు, పసివాళ్ళకు పాలులేవు మేకలు, గేదెలు చచ్చి కొట్టుకొని పోతున్నాయి.

ఆ రాత్రి....

ఎక్కడో ఉరేలున మెరిసింది. కళ్ళుపోయాయనిపించింది ఇల్లు ఫెళఫెళమని శబ్దంచేసింది. కెవ్వుమని అరిచింది తను. అమ్మ తనని భుజంపైన వేసుకొని గబగబా బయటికి తీసుకొచ్చింది.

గాలి విసురుకి ఎగిరిపోతామేమో నన్న భయంవేసింది. వానచినుకులు పదునయిన బాణాల్లా తగులుతున్నాయి. నాన్న గారు పోయారు. ఇల్లు కూలిపోయింది. పిచ్చెక్కి విలయ తాండవం చేస్తున్న ప్రకృతి శక్తితో పోరాడుతూ నిలదొక్కు కోడానికి ప్రయత్నంచేస్తు అమ్మ తననెత్తుకొని బయటకొచ్చింది. కొంతమంది చూస్తూనేవున్నారు. కానీ ఎవరూ అమ్మకి సాయం చేయడానికి రాలేదు. ఆ పరిస్థితిలో అంతసాహసం ఎవరుమాత్రం చేస్తారు. మొలలోతు నీళ్ళలో అమ్మ అడుగులేస్తుంది. నీటి వేగానికి కొట్టుకుపోతామన్న భయంతో అమ్మ విలవిల్లాడిపోయింది. అమ్మవంటిపైన చీర కొట్టుకుపోయింది. అయినా అమ్మ తనని వదిలిపెట్టలేదు. తనని ఓదారుస్తూ చావుపై తిరగబడి పోరాడుతూ అమ్మ గుడిమంటపంపైకి అతి కష్టంతో చేరుకొంది. గుడిమంటపం ఎత్తుగావున్న దిబ్బపైన కట్టబడింది. గాలి అరుస్తుంది. మూగులు

తోంది. సీలుగుతోంది. బొబ్బలు పెడుతోంది. ప్రజలు ప్రాణాలని అరిచేతుల్లో పెట్టుకొన్న క్షణాలవి.

గాలిదేవుడి ప్రచండ రూపాన్ని చూడలేని భూమాత లబ్బో దిబ్బో మని మొత్తుకొంది. వేడుకొంది. నన్ను ఇంతటితో వదిలి పెట్టమని ప్రార్థించింది ఏడిచింది మొత్తుకొంది.

కానీ గాలిదేవుడు కనికరించలేదు. భూమాత కన్నీటిని ఖాతరు చేయలేదు.

'నీ ఖర్మం ఇంతే' అన్నట్టుగా మరింత విజృంభించాడు. దూరంగా ఏదో సల్లగా ఎత్తుగా రాక్షసిలా ఉరుకుతూ కనబడింది.

"ఉప్పెన" ఎవరో అరిచారు.

జనం ప్రాణ భీతితో రోడ్డుపైకి నీళ్ళలో కురికారు. ప్రాణాలు కాపాడుకోడానికి. పరుగెత్తడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. చీకటిలో, ఆ గాలిలో వానలో ఉప్పెన మృత్యువులా విరుచుకు పడుతున్న ఆ సమయంలో తల్లి తనని గుండెల కదుముకొంది. ముద్దులతో నింపేసింది బావురుమంది.

"ఈ స్తంభాన్ని గట్టిగా పట్టుకో" అని అరిచింది.

గుడి మండపం ఎత్తులో వుంది. కాని ఉప్పెనని చూసి అప్పటివరకూ అక్కడ ఆశ్రయం పొందిన వాళ్ళు కొంతమంది కేకలతో క్రిందికిదూకి పరుగెత్తటం మొదలుపెట్టారు. ఎవరో అమ్మ చేయి పట్టుకులాగారు. అమ్మ మండపం పైనించి కిందికి జారిపోయింది.

'అమ్మా, అమ్మా' అని తను ఏడుస్తూనే వుంది.

స్తంభాన్ని గట్టిగా పట్టుకొని ఒదలలేదు. ఉప్పెన విరుచుకు పడింది గుడి మండపం అటూ యిటూ కదిలినట్టయింది. తన మీదుగా నో ప్రవాహం విసిరికొడుతూ వెళ్ళిపోయింది.

నోటికి ఉప్పగా నీరు తగిలింది.

మండపం పైన తనొక్కతే ఒంటరిగా యేదుస్తూ కేకలు పెడుతూ, భయంతో ఉప్పెనలో చిక్కుకొని రోదించింది. విలవిల్లాడిపోయింది. ఆరాత్రి గాలిదేవుడు పగ పట్టారనట్టు జనలు కొట్టాడు. గంతులు వేశాడు. సీలిగాడు. మూలిగాడు. గాలిదేవుడి కోపతాపాలకి తాళలేక సముద్రుడు స్థానభ్రంశం చెందాడు. పచ్చని

పంటలతో పిల్లా పాపలతో కళాకాంతులతో తులతూగే ఆ ఊరి
కనీస జ్ఞాపకాలు కూడా మిగలకుండా కొట్టుకుపోయింది. వేణు
గోపాలస్వామి దయతలచినట్టుగా తన ప్రాణాలు దక్కాయి
అమ్మ ఉప్పెనలో కొట్టుకుపోయింది.

నెలరోజుల తేడాలో నాన్నగారు, ఇల్లు, అమ్మ పోయారు.

మిగిలింది కట్టుగుడ్డలతో అనాథగా దిక్కులేని తను లసల
దొరికిన కొంతమందిని పోలీసులదగ్గర్నుంచి కళావతి తీసుకెళ్లింది

కళావతి వయసులో నాట్యకర్తగా మంచిపేరు గడించింది
నటరాజుకు తన జీవితాన్ని అంకితం చేసుకొని పెళ్లి చేసుకోకుండా
తన జీవితాన్ని డాన్స్ స్కూలు పెట్టుకొని అందమైన ఆడపిల్లల్ని
చేరదీసి నాట్యంనేర్పి తన కళని సార్థకం చేసుకొంటుంది. హేమ
అన్న తన పేరుని మార్చి 'జయ' అని పేరు పెట్టింది'

పన్నెండేళ్ళ వయసులోనే అన్నీ పోగొట్టుకున్న తను
పేరుని కూడా మార్చేసుకోడానికి పెద్ద అభ్యంతరం కనిపించలేద

కళావతి శిక్షణలోనే తను రూపురేఖల్ని దిద్దుకొంది.

చక్కని వ్యాయామ పరిశ్రమతో అవయవాలు పొందికగా
ఏర్పడి అపురూపమైన సౌందర్యవతిగా, పరిపూర్ణమైన సౌందర్య
వతిగా, పరిపూర్ణమైన ఆడదానిగా జయ తయారైంది.

కళావతి నృత్యకళానికేతన్‌లో ప్రస్తుతం వున్న ముప్పై
మందిలో జయంటేనే కళావతికి ప్రత్యేకమైన అభిమానం. జయ
వల్లనే తనకీ, సంస్థకీ కూడా మంచి పేరుప్రఖ్యాతులు వచ్చాయ
ఆమె నమ్మకం. అది కేవలం నమ్మకం మాత్రమే కాదు నిజ
కూడాను.

కళావతి తన దగ్గరవున్న ప్రతి కళాకారిణికి కావాల్సి
ప్రతిచిన్న వస్తువు దగ్గర్నుంచీ తానే స్వయంగా ఏర్పాటుచేస్తుంద
చిన్నతనంనించీ అనాథబాలికల్ని పెంచి పెద్దచేసినందువల్ల ఓ వి
మైన వాత్సల్యంకూడా అలవాటుంది. అయినాసరే ఎవరివల్లనైనా
సంస్థకి చెడ్డపేరు వస్తున్నదీ అంటేచాలు వాళ్ళని బయటకి పంప
డానికి ఏమాత్రం సంకోచించదు. జాలి అసలేచూపదు. ఒకరిద్ద
విషయంలో జయ స్వయంగా అలా జరగటంచూసింది. మగ
తనకోసం రావడం మొదలుపెడితే వూరుకోదు కళావతి. ఆసంగ

జయకి తెలుసు. కానీ కొన్ని సంవత్సరాలతర్వాత తన సర్వస్వం అనుకొనేమనిషి కనబడితేకూడా స్వేచ్ఛలేని జీవితం అయిపోవ డంతో జయ నిరుత్సాహపడిపోయింది. ఆలోచనలతో నిద్రరావడం లేదు. జయలేచి కిటికీదగ్గరగా నడిచింది.

"నిద్రరావడంలేదా?" కల్పన అడిగింది.

తలతిప్పిచూసింది జయ. కల్పన తనకేసే చూడ్డాన్నిచూసి "లేదు" అంది.

కల్పనకూడా లేచి కూర్చుంది.

కళానికేతన్‌లో కల్పన జయకి మంచినేస్తం. తన అన్ని విషయాలుతెలుసు కల్పనకి. కల్పన ఒక్కొసారి జయ విషయాల్లో గార్డియన్‌లా వ్యవహరిస్తుంది. జయ ప్రోగ్రాం వున్నప్పుడు సాధా రణంగా కల్పనే జయకి మేకప్‌చేస్తుంది. జయ నాట్యప్రదర్శన జరిగేటప్పుడు మధ్య మధ్యన గాపులో కల్పన నృత్యం చేస్తుం టుంది. కల్పనకి ఈ శాస్త్రీయ నాట్యాలపైకంటే వెస్ట్రన్ స్టెప్పు డాన్సులంటే చాలా ఇష్టం. కల్పనకి నా అనేవారు ఎవరూ లేరు. కానీ అవసరం అనుకొంటే 'నాబతుకు నేను బతగ్గలను' అనే ఓ ధీమా మాత్రం ఎప్పుడూ ఆమనిషిలో వుంటుంది. అందుకే కళా పతికి కల్పనపైన రవంత కోపం లేకపోలేదు.

"ఎందుచేత?" అడిగింది మోకాళ్ళచుట్టు చేతుల్తో కట్టు కుంటూ.

"మధు కనిపించాడు."

ఉలిక్కిపడింది కల్పన.

"రియలీ?" అరిచింది కల్పన.

"అవును. ఇవాళ ప్రోగ్రాంకి అతనొచ్చాడు. ప్రదర్శన అయినాక నాదగ్గరకొచ్చి కలిశాడు," అంది జయ.

కల్పన అమాంతం మంచం పైనించిలేచి జయని కౌగాలించు కొని బుగ్గపైన ముద్దుపెట్టుకొంది.

"కంగ్రాట్స్ మైడార్లింగ్. యింతకాలానికి నీ నిరీక్షణ ఫలించినందుకు నిజంగా నాకు ఆనందంగా వుంది. ఇప్పుడు దేవు డంటే ఓవిధమైన భక్తీ భయమూకలుగుతున్నాయి" అంది కల్పన.

రేపు సాయంత్రం కలుస్తానని చెప్పాను. మేడమ్‌కి తెలు

స్తుందని భయంగా వుంది. తెలిస్తే గొడవ చేస్తుంది," దిగులుగా అంది జయ.

"నో మేడమ్ బిజినెస్ మై స్వీట్ గర్ల్. ఇంకా మేడమ్ మేడమ్ అని పట్టుకు కూర్చుంటావా? హీరో వచ్చాడు. ఇంకా భయం దేనికే?" అంది కల్పన.

"ఏమో అతను కనబడకముందు ఎన్నో అనుకున్నాను. కనబడ్డాక ఇప్పుడు మేడం భయం పట్టుకొంది."

"ప్రోగ్రాం వుండేగానీ, లేని రోజునకూడా దానికెందుకు భయపడాలి."

"తప్పు. మనల్ని ఇంతవాళ్ళని చేసినందుకైనా గౌరవిం చాలిగా."

"కావచ్చు, నిజమే. కానీ ఇది జైలుకంటే అధ్వాన్నంగా తయారైతే ఎలా? పోయినంతకాలం ఈ నాలుగోడలమధ్య మగ్గి పోవాలంటే నువ్వు ఎన్నన్నా చెప్పు. నావల్ల మాత్రం కాదు."

"అలాని ఈ హద్దు దాటగలమా కల్పనా?"

"నువ్వే చెప్పు. మనిషికి కాస్తంత మానసికంగా వికాసం కలగాలంటే ఈ నాలుగోడలమధ్యవుంటే జరిగే పనేనా? ఇంత కంటే ఏ తప్పోచేసి జైలుకెళితే బాగుంటుంది." అంది కల్పన.

"పోవే. నీదంతా ఆవేశం."

"ఏమో నీ సంగతేమో. నేను మాత్రం ఎక్కువ రోజులు ఈ నాలుగోడలమధ్యా వుండలేను. ఎప్పుడో ఎగిరి పారిపోతాను."

జయ నవ్వింది.

ఎందుకే అంత కోపం" అంది-

"నా గొడవ వదిలేయి, నువ్వేం చేయదలుచుకున్నావో చెప్పు." అంది కల్పన.

"అతన్ని ఎలా కలుసుకోవాలా అని ఆలోచిస్తున్నాను."

"కలుస్తావా మరి?"

"కలవాలి!"

"కలవకపోతే!"

"ఉండలేను"

"అంటే?"

"ప్రాణమే పోవచ్చు"

"ప్రాణం పోయేంత పరిస్థితి వచ్చినప్పుడు. యీ మేడమ్ మెందుకు కేర్ చేయడం. అదీకాక అతను నిన్ను పెళ్ళిచేసుకుని వాడు. ఇక్కడ్నుంచీ ఎలాగూ తీసుకెళ్ళిపోతాడు. అలాంటప్పుడు ఎప్పయంగా ఆ విషయం ఆ బోడి ముండకి చెప్పేస్తేపోలా?" అంది.

"తొందరపడితే ఎలా?" అంది.

"ప్రతి మనిషికి ఆశ వున్నట్టే యెదురుచూపు కూడా వుండాలే ఆ ధారీ, నిరాధారీ, బలవంతుడు, బలహీనుడు, ఉన్న వాడు లేనివాడు అందరి మనసు ఏదో ఒక శక్తి చుట్టూ పరిభ్ర మిస్తూనే వుంటుంది.

"వాడు ముసుచేసి ప్రాణముపోసి ఆడేవు నీ కేదివేడుకా" అంటాడు శ్రీశ్రీ. పరిస్థితిని నీ కందుబాటులో వున్నప్పుడే అన్నీ చక్కదిద్దుకోవాలి."

"నా కెందుకో భయంగా వుంది"

"దేనికి? నీ జోడి భయాన్ని కట్టిపెట్టు"

"మేడమ్‌కి నిజం చెప్పినా నమ్ముతుందన్న నమ్మకం నాకు లేదు. ఆవిడ ప్రస్తుతం నా పైన అన్ని నమ్మకాలు పెట్టుకొంది"

భయమాటలకి కల్పన పకపక నవ్వేసింది.

"పోవే ముద్దు, గోళానికి కేంద్రం ఒకటే. భూమిచుట్టూ తిరిగినా తిరిగి ప్రారంభ స్థానానికే చేరుకొంటుంది. ఇక్కడికి కొచ్చి నప్పుడు నీకేమీ తెలీదు అనేదానివి. పసిదానివి కానీ యీ రోజు గొప్ప కాకారిణివి. నువ్వెళ్ళిపోతావని మేడం దిగులుపడనవసరంలేదు. మరొంపదే మరోట యీ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అవకాశం లేక గాని అర్హతలున్నవాళ్ళు దేశంపైన కొల్లలు జయా!"

"సుచ్చింటిగా ఎందుకుచెబుతున్నావో నా కర్థంకావడంలేదు"

"ఈ అందమైన అమ్మాయికి పెళ్ళికావాలని."

"నాకు పెళ్ళయితే నీ కేమొస్తుంది."

"తృప్తి."

"నేనంటే నీ కెందుకే అభిమానం"

"రక్తం పంచుకుని పుట్టకపోయినా నువ్వు నా చెల్లెలాంటి దానివే. నీ కోసం ఈ కల్పన ఏమైనా చేస్తుంది, అదంతే!"

"థాంక్స్" అంది జయ.

"లైటార్పేసి పడుకో. నిద్ర అదేవస్తుంది." అంది కల్పన
జయ అందుకు ఎదురు సమాధానం చెప్పలేదు.

మంచంమీద పడుకొన్నదేకానీ కంటిమీదకి నిద్రరావాయె. ఇంతకాలం మనసుని వేధించిన సమస్యలు పటాపంచలై పోగా ఇప్పుడు జయకళ్ళముందు మాధవ్ పూర్తిగా నిండిపోయా... కలతజారుతోన్న నిద్రలో అన్నీ అతని జ్ఞాపకాలే జయకి.

ఉత్సాహంగా తెల్లవారింది. లేవగానే ఎక్సర్‌సైజు, కా... కృత్యాలు, కాఫీ టిఫెన్, రిహార్సల్స్ అన్నీ అయ్యేసరికి ఒంటి గంట. అలసిపోయి అలాగే కాస్తభోజనం అదీచేసి మంచంపైని వాలిపోయింది జయ.

"అయిదుగంటలకి మాధవ్‌కోసం వెళ్ళాలి. ఇన్నిరోజు... తన కలనిజంకాబోతున్నతరుణంలో ఆఖరికి ఆదేముడు దిగొచ్చినా లెఖ్ఖచెయ్యకూడదు" అనుకొంది జయ.

ఆటో ఎక్కి 'అన్నటైంకంటే రెండునిముషాలు ముందే రేడియో స్టేషన్ బస్‌స్టాప్‌దగ్గిరకి చేరుకుంది జయ.

అయితే అప్పటికే మాధవ్ వెయిట్‌చేస్తున్నాడక్కడ. జయ రావడం చూసిన అతని కళ్ళు ఆనందంతో మెరిసినాయి. మాట్లా... కుండా వెళ్ళి చిరునవ్వుతో మోటార్‌సైకిల్ వెనకఎక్కి కూర్చుంది జయ.

నౌబత్ పహాడ్ కొండదగ్గిర జావా ఆపాదు మాధవ్. ఒ... ర్నొకరు చూసుకొన్నారు. ఒకరి చెయ్యి నొకరు గట్టిగా పట్టుకొ న్నారు. పక్కపక్కగా నడుస్తూ ఒక్కొమెట్టే పైకెక్కుతున్నార ఒకరి భుజం ఒకరికి తగుల్తోంది. మనసులోవున్న ఎన్నోమాటలి చెప్పుకోవాలన్న ఆరాటం. ఇద్దరూవెళ్ళి సిమెంటు బల్లపైన కూర్చు న్నారు. చల్లగా వీస్తున్నగాలి వాళ్ళ మనోఫలకాలమీద ఎన్నో ముద్రలు వేస్తోంది, మరెన్నో జ్ఞాపకాలని గుర్తుచేస్తోంది.

"హేమా!" అన్నాడు.

"ఊహు.... 'జయా' అని పిలువు."

"నువ్వు నా హేమవి."

"కాదనను. కానీ హేమగా నేనో దురదృష్టవంతురాలిని.

నాన్నని, అమ్మని, ఇంటిని పోగొట్టుకుని అనాథనయ్యాను. జయగా నిన్ను తిరిగి పొందగలిగాను. కనుక నేను జయని," అంది జయ.

"ఓకే," అన్నాడు.

మాధవ్ ఎక్కడినించో పర్వతాలు, సముద్రాలు, లోయలు ఖండాలు దాటుకొని అతిప్రయాసతో తనని కలుసుకోవాలనీ ఎన్నో చెప్పాలని వచ్చాడని తెలుసు. ఆత్రంగా అతనికి ఎదురు వెళ్ళి ఏదో అతన్నించి వెదుక్కోవాలనీ తనుకొంది. కానీ ఇద్దరూ దరిచేరారు. కళ్ళలోకి చూసుకొన్నారు. మరి ఆమాటలన్ని చెప్పాలనుకొన్నవి, వెదుక్కోవాలనుకొన్నవీ ఏమైపోయాయ్। చిత్రం....

జయ కళ్ళల్లోకి నీరు సుడులై తిరిగింది.

"మళ్ళీ మనం ఇలా కలుసుకుంటామని కలలోకూడా అనుకోలేదు మధూ." అంది అతని చేతిని గట్టిగా పట్టుకొంటూ. ఆ చేతిని విడిస్తే మళ్ళీ అతను తనకి కనబడకుండా దూరమైపోతాడేమోనన్న ఓ భయం ఆ చూపులో మాధవ్‌కి కనబడింది.

జయ మెడమీదుగా చేయివేసి ఎడంచేత్తో జయ గెడ్డాన్ని పట్టుకొని మొహాన్ని పైకెత్తాడు.

"ఉప్పెనలో మీరంతా పోయారనుకున్నాను. కానీ నాకు ఓ పిచ్చినమ్మకం జయా. నువ్వెక్కడో నా కోసం వుంటావని ఎప్పుడో మనం ఖచ్చితంగా కలుసుకొంటామన్న నమ్మకం నాకుండేది జయా."

"ఇంతకాలం నా కోసం చూస్తూనేవున్నావా మధూ."

గొంతు వణికింది జయకి.

"ఇంత కాలమేకాదు. ఇంకా ఎంతకాలమైనా ఎదురుచూస్తూ ఇలాగే వుండేవాడిని నీ కోసం."

"ఏమో ! ఈ చిన్ననాటి నేస్తం నీకింకా గుర్తుంటుందా అనుకొనేదాన్ని. కానీ నేను నీకోసం నా జీవితాన్ని అంకితం చేసేసుకొన్నాను. నువ్వంటూ నాకు తారసపడకపోతే నేనెప్పటికీ ఇలాగే వుండిపోయేదాన్ని."

"అందమైన నీ జీవితాన్ని నా కోసం వ్యర్థపరుచుకొనేదానివా ?" అడిగాడు మధు.

"ఎవరికీ చెప్పొద్దు. నన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పావు.

నేనెవరికీ చెప్పలేదు. ఆ మాటని గుండెల్లో పెట్టుకొని నీకోసం నిరీక్షణతో గడిపాను."

తన మాటపైన అంత విశ్వాసంతో అంతవరకూ వున్న జయని చూస్తుంటే మాధవ్‌కి జయ మామూలు మనిషేనా అని పించింది.

ఎన్నో శిఖరాల ఎత్తులో వో ఉన్నత స్థాయిలో ఆమె వ్యక్తిత్వం పెరిగిపోయింది అతని మనసులో.

మెల్లగా తలెత్తిచూసింది. అతనికళ్ళల్లో కళ్ళుకలిపి దేని కోసమో వెదికింది. కళ్ళుచెమర్చాయి.

"కన్నీరెందుకు?" చేతివేలితో తుడుస్తూ అడిగాడు మాధవ్.

"నాన్నగార్ని పార్టీ కక్షలతో చంపేయడం నాకు తెలుసు. గాలివానకి ఇల్లు కూలిపోడం కళ్ళారాచూసాను. నా ప్రాణాల్ని కాపాడ్డానికి అమ్మ సాహసంచేసి ఉప్పెనలో కొట్టుకుపోయింది. పేరు ప్రఖ్యాతులుగడించి నర్తకిగా పేరుపొందినా నేను అనాధననే బాధ నా గుండెల్లో ప్రతిక్షణం ముల్లులా గుచ్చుకొంటూనేవుంది. నువ్వెక్కడున్నావో తెలీదు. నేనసలు నీకు గుర్తున్నానో లేదో తెలీదు. అంతలోనే మరో అనుమానం. నీకు పెళ్ళిగానీ అయిపో యిందేమోనని."

మాధవ్ బాధగా అన్నాడు.

"పిచ్చి జయ, నీకిచ్చినమాట మరచిపోయా ననుకున్నావా?"

"ఏమో మనం ఒకచోట పుట్టి ఒకచోట పెరిగి వుండచ్చు. కానీ మనం మధ్యలోనే దూరం అయ్యాము. తర్వాతనువ్వెక్కడో నేనెక్కడో పెరిగాం."

"అంటే?"

"జీవితం వినాశనమో. వినూత్నమో కావడానికి ఒక్క క్షణం చాలు మధూ. కడివెడుపాలలో ఒక్క తోడుచుక్కచాలదు. బ్రతుకనేది ఏ ఒక్క క్షణంపైన అయినా ఆధారపడి వుండొచ్చు. అది అనుభవం నాకు నేర్పిన పాఠం."

మాధవ్ సిగరెట్ వెలిగించాడు.

ఎత్తైన ఆ కొండమీంచి సుందరంగా కనిపిస్తోన్న నగర శోభని తిలకిస్తూంది జయ.

ఓ పక్క రవీంద్రభారతి, అసెంబ్లీహాలు, రేడియోస్టేషను, మరోవైపు బిర్లా మందిరం అందమైన దీపాలతో వైకుంఠాన్ని మరపిస్తోంది. ఇంకోవైపు హుస్సేన్ సాగర్, టాంక్ బండ్ ఎర్రని అక్షరాల్లో రిట్జి హోటలు, అందమైన దీపాల్లో నగరం కనబడు తోంది. చల్లనిగాలి తెరలుగా వీస్తుంటే మనోహరంగా వుంది. ఆకాశంలోకి నక్షత్రాలు వచ్చినయి చంద్రుడూ వచ్చాడు.

"నిన్న ప్రళయం వస్తుందేమో ననిపించిన ప్రకృతి ఈ వేళ ఎంత ప్రశాంతంగా వుందో చూశావా?"

"అవును" అన్నాడు.

మాధవ చేతిలో జయ చేయి బిగుసుకుంటోంది.

"ఎన్ని రోజులుంటావు హైదరాబాదులో" అడిగింది.

సిగరెట్ పీకని దూరంగా విసిరాడు,

"మరో నెల అప్పుడే నెల రోజులయింది. కానీ నువ్వు కనబడ్డాక వెళ్ళాలనిపించడంలేదు" అన్నాడు మాధవ.

జయ నవ్వడానికి ప్రయత్నం చేసింది.

"నువ్విలా మిలిటరీ ఆఫీసర్ వి అవుతావని నే నెప్పుడూ అనుకోలేదు" అంది.

"ఆ పల్లెటూరిపిల్ల ఇంత గొప్ప డాన్సర్ అవుతుందని నేను మాత్రం అనుకొన్నానా?"

ఇద్దరూ మనసారా నవ్వుకున్నారు.

చాలాకాలంగా కలుసుకోవడంచేత కాబోలు ఏ ఒక్క విషయాన్ని గురించి విశదంగా మాట్లాడుకోలేక పోతున్నారు.

అతని ఎడంచేతిని తన చేతిలోకి తీసుకొని గడియారంలో టైం చూసింది.

"ఎనిమిదయింది. వెళ్దాం" అంది.

"అప్పుడే!"

"నీకేం, వెళ్ళాక ఎన్ని చివాట్లు తినాలో ఖర్మ!"

"ఎందుకు?"

"ఎందుకేమిటి? మాది చాలా క్రమశిక్షణలో నడుస్తోన్న సంస్థ. అన్నీ టైం ప్రకారం జరగాలి. జరిగే ప్రతి చిన్న విషయాన్ని మేడమ్ కి చెప్పాలి!"

"నేనొచ్చి చెప్పనా ?" అడిగాడు మాధవ్.

"ఏమని ?"

"జయ నాక్కాబోయే భార్యని."

జయ చెక్కిళ్ళు ఎర్రబడినయి.

"చాల్లే. పెద్ద! ఇన్నిరోజులకొచ్చి."

నిష్ఠూరంగా మాట్లాడింది.

ఇద్దరూ లేచి అక్కణ్ణుంచికదిలారు.

జయ నడుంచుట్టూ చేయివేసి నడిపిస్తున్నాడు మాధవ్. అతనికి మరింత దగ్గరగా నడుస్తూ గాలికి చెదిరిపోతున్న జుత్తుని చేత్తో వెనక్కి తోసుకొంటూ నడుస్తోంది జయ.

ఓ పదిమెట్లు దిగాక పెటగోడవారగా నిలుచున్నారు. ఇద్దరికీ అక్కడ్నుంచి కదలాలనిలేదు. ఒకర్నొకరు చూసుకుంటూ అక్కడే వుండిపోవాలనుంది. విడిపోతే మళ్ళీ ఎప్పుడో అన్న బెంగ. పిట్టగోడనానుకొని రెండుచేతులూ అతని భుజాలపైన వేసింది. అతని చేతులు ఆమె నడుంచుట్టూ తిరిగాయి. మెల్లిగా వంగి జయ పెదవుల్ని అందుకున్నాడు మాధవ్.

ఏదోకావాలనీ, మరేదో అయిపోవాలని ఇద్దరికీ వుంది.

"ఇప్పుడు నా ప్రాణాలు నీ పెదవుల్లో వున్నాయి జయా" అన్నాడు మాధవ్.

జయకళ్ళతోనే నవ్వింది.

"వదిలపరుస్తాను."

"నేను చాలా అదృష్టవంతుడ్ని జయా. చేయిజారి పోయిందనుకొన్న పెన్నిధి తిరిగిదొరకడం నిజంగా ఏనాడో నేను చేసుకొన్న పెన్నిధి పుణ్యమే కారణం."

"అది నీ అదృష్టం కాదు మధూ. ఏ దిక్కూలేని ఈ అనాథకి దేవుడు కరుణించి నాకిచ్చిన వరానివి నువ్వు."

"నీగురించి అమ్మకి తెలుస్తే చాలాసంతోషిస్తుందితెలుసా ?" అన్నాడు మాధవ్.

"చెప్పలేదా ?"

"అమ్మ మామయ్యవాళ్ళ వూరు వెళ్ళింది. రెండ్రోజుల్లో వస్తుంది" అని నవ్వి.

"ఎందుకెళ్ళింవో అడగవే" అన్నాడు.

"ఎందుకు ?"

"వాళ్ళబ్బాయి పెళ్ళిచేసుకోనని మొండికేశాడు. అందుకని వాళ్ళన్నయ్యకిచెప్పి ఏ పిల్లనన్నా చూడాలని వెళ్ళింది."

"ఆ మాటలకి జయమొహం చిన్నబోయింది.

"ఇంతసేపూ చెప్పినవన్నీ కబుర్లేనా ?"

జయ అలా మారడంతో మాధవ్ నవ్వేశాడు.

"చూశావా ! అన్నానో లేదో అప్పుడే ఎలా అయిపోయావో నువ్వు కనపడ్డావని తెలిస్తే అమ్మనన్ను మరో పిల్లని చేసుకో నిస్తుందా అసలు"

ఆమాటలలో జయ తిరిగి ప్రసన్నంగా మారింది. ముసి ముసిగా అతనిచేతిని చేతిలోకి తీసుకొని ముద్దుపెట్టుకొంది.

"వెళదామా!" అడిగాడు.

"ఊ" అంది.

మాధవ జయని కళానికేతన్‌కి కాస్త దూరంలో దింపేశాడు జయ గేటు తీసుకొని లోపలికెళ్ళేవరకూ చూసి వెళ్ళిపోయాడు అక్కడినించి.

జయ భయం భయంగా లోపల కెళుతుంటే కళావతి ఎదురుగా వచ్చింది. జయ యెక్కడికో వెళ్ళివస్తుందన్న విషయాన్ని తెలికగా పసిగట్టింది. చేతిగడియారం కేసి చూసింది. తొమ్మిది దాటుతోంది. సుమారు అయిదుగంటలనించి జయ కనకకనబడక పోతే గదిలోనే వుందనుకొంది కళావతి. జయ గుటకలు మింగుతూ చూసింది మేడమ్‌ని.

"ఎక్కడికి కెళ్ళావు?" అడిగింది.

"పిక్చర్ కెళ్ళాను" అంది గొంతు పెగల్చుకొని.

జయ అవిధంగా వెళ్ళడం అదే మొదటిసారి. అదీకాకుండా జయ చాలా అణకువగా వుంటుంది. ఏ రోజునా బాధ్యతా రహితంగా ప్రవర్తించిన సందర్భంలేదు. సినిమాకి కూడా తనతోకలిసి రావడమే కానీ యిలా ఒంటరిగా వెళ్ళలేదు. కళావతి అదోలాచూసి తల పంకించింది.

"చూడు జయా! నువ్వెవరో ఏమిటో సిటీలో చాలా మందికి

తెలుసు. ఇలా పంటరిగా బయటకెళితే వాఖ్యానాలకి గురి కావడమే కాదు సంపాదించుకొన్న కీర్తి ప్రతిష్టలకి కూడా భంగం కలుగుతుంది" అని వెళ్ళిపోయింది.

కళావతి యిచ్చిన చిన్న ఉపన్యాసానికి పట్టిన చిరు చెమటని పమిట చెరగుతో తుడుచుకొని గదిలోకి వెళ్ళింది జయ. నిజానికి కళావతి మాటలు యదార్థం కాకపోలేదు.

నృత్య కళానికేతన్ నడుపుతుంది ఓ ఆడది. అందులోవున్న వాళ్ళు అందరూ ఆడపిల్లలే. అందుకే ఎవరి దృష్టిలోనూ చెడు అనే ముద్ర పడకుండా వుండాలని కళావతి తాపత్రయం, భయం, ఆరాటం. జయ మంచంపైన కూర్చుని పమిట చెంగుతో విసురుకో సాగింది.

కల్పన గదిలో అడుగుపెట్టబోతూనే జయనిచూసి.

"అక్షింతలుపడ్డాయా!" అంది.

"ఈ రోజుకి తప్పిపోయినయి."

"గుడ్ వెళ్ళి భోజనంచేసిరా" అంది.

జయ డ్రస్ చేంజి చేసుకొని మెస్‌కి వెళ్ళింది.

* * *

జయకి ఆ నెలలో మూడు ప్రోగ్రామ్సు వున్నాయి. అంచేత ఎక్కువ రిహర్సల్స్ వేయిస్తుంది కళావతి.

ఉదయం కళావతి పిలిచి చెప్పింది.

"జయా! ఈసారి ప్రోగ్రాంలో మరో రెండు మూడు కొత్త ఐటమ్స్ చేయాలి. ఏం చేస్తావో నువ్వే ఆలోచించుకో. ఈసారి మనకి అవకాశం యిచ్చిన సంస్థలు చాలా పెద్దవి! గొప్పవి. శ్రద్ధగా రిహర్సల్స్ చేయి" అంది.

జయకిదంతా పెద్ద బోరుగా వుందిప్పుడు. మధువుండేది నెల రోజులు, మళ్ళీ వెళ్ళిపోతే సంవత్సరంవరకూ రాడు. అతన్ని చూడకుండాను కలుసుకోకుండాను వుండలేదిప్పుడు. సమయానికి ప్రోగ్రామ్స్ అన్నీ ఇప్పుడే వచ్చిపడినయి. ఏం చేయాలో తోచ లేదు జయకి.

తను మళ్ళా వస్తానని చెప్పి రెండు రోజులు వెళ్ళలేక పోయింది.

మధు ఏమనుకొన్నాడో అన్నబాధ ఓ పక్క పీకుతోంది. క్రితంరోజు రెండుసార్లు నృత్యకళానికేతన్ ముందునుంచి మాధవ్ మోటర్‌సైకిల్‌పైన వెళ్ళడం జయ చూసింది. తనకోసం అతనెంత తహతహలాడి పోతున్నాడో తెలుసు జయకి. అందుకే ఏం చేయడానికీ తోచనిస్థితిలో పతిపోయేలావుంది. మర్నాడు సాయంత్రం మాధవ్ కళానికేతన్‌కి వందగజాల దూరంలో ఓ చెట్టుక్రింద మోటార్‌సైకిల్ ఆపి, నిరీక్షించడం చూసింది. ఇక వుండలేకపోయింది. జయకి లెగింక్షవచ్చింది. 'ఏంజరిగితే అదేజరగనీ' అనుకొని గబగబా బయటకి నడిచింది. జయని చూస్తూనే మాధవ్ మోటార్‌సైకిల్ స్టార్ట్‌చేసాడు. జయ మాట్లాడకుండా వెనక ఎక్కికూర్చుంది. మాధవ మోటార్‌సైకిల్ నౌబత్ పహడ్‌దగ్గర ఆపాడు. అతను మవునంగా నడుస్తూంటే అతని చేతిని పట్టుకొని ఆసరా చేసుకొని నడుస్తూ.

"నువ్వేమనుకున్నావో.... మధూ, మేడమ్ గొడవ చాలా ఎక్కువై పోయింది. అదీకాక ప్రోగ్రామ్సుకూడా ఏక్కువయిపోయినయి ఈనెల్లో. అహ, నీకంటె అది నాకెక్కువని కాదు. కానీ ఏంచేయాలో తెలీక, అంతే। ఓ పక్క నువ్వు వెళ్ళిపోతావన్న దిగులు మరోపక్క బాధ్యత. చెప్పు నామీద కోపంగానీ వచ్చిందా। ప్లీజ్," అంది.

మాధవ్ మాట్లాడకుండా కూర్చుని సిగరెట్ వెలిగించాడు. అతను మాట్లాడకపోవడంలో జయ అతనికి నిజంగానే తనపైన కోపం వచ్చిందని భయపడింది.

బిక్క మొహంపెట్టి జాలిగా తనకేసి జయ చూస్తుంటే మాధవ్ గట్టిగా నవ్వేశాడు. దానితో జయ మనసు కుదుటపడింది.

"నాకు నీ కష్టం సుఖం అన్నీ తెలుసు జయా. నిన్ను చాలా ఇబ్బంది పెడుతున్నాననీ తెలుసు. కానీ నిన్ను కలుసుకోవాలనే తాపత్రయంమాత్రం నన్ను వెర్రివాడ్నిచేస్తోంది. ఇంతకీ ప్రోగ్రామ్స్ ఎక్కడెక్కడ?"

"హైదరాబాదు, బెజవాడ, వరంగల్."

"ఈ మూడు ప్రదర్శనలకీ నేనూ వస్తాను."

"నువ్వొస్తావని నాకు తెలుసు"అంది.

అతనందుకు నవ్వాడు.

పూలమ్మే పిల్ల మల్లెపూలదండలు తెచ్చింది. మాధవ్ ఓ దండకొని జయకివ్వబోయాడు.

జయ కోపంగా చూసింది.

"ఛాల్లే మర్యాద పూలెవరన్నా చేతికిస్తారా?" అంది.

మాధవ్ ఆ మాటలకి నవ్వుతూ మల్లెమాలని జయ తల్లో పెట్టాడు. వెనకనుంచి చేతుల్తో జయనిచుట్టేసి ఆ మల్లెలని వాసన చూశాడు.

"ఏయ్ ఏమిటిది?" అంది.

"చూస్తూ ఏమిటని అడిగితే ఏం చెప్పను?" అన్నాడు.

"అందుకే అడిగేది ఇది పబ్లిక్ ప్లేసు"

"కాకపోతే అమ్మాయిగారికి అభ్యంతరం లేదన్నమాట" చిన్నగా నవ్వేడు.

అతనిమాటలకి మాధవ్ కళ్ళల్లోకిచూసింది జయ.

"మధూ" పిలిచింది. అలా పిలవటం ఒక్క జయకే సాధ్యమేమో అనిపించింది మధూకి.

"ఊ చెప్పు," అన్నాడు.

"నువ్వు వెళ్ళిపోతావన్న మాట గుర్తుకొస్తే నాకు భయంగా వుంది మధూ."

"భయం దేనికి?"

"ఏమో యింకా కొన్నాళ్ళువుండకూడదా?" ఆశగాచూస్తూ అడిగింది.

"నిన్ను వొదిలి వెళ్ళాలని నాకు మాత్రం వుంటుందా జయా! కానీ దేశ రక్షణకోసం అంకితంచేసుకొన్న జీవితాలు మావి, అవసరం అయితే ప్రాణాన్ని సైతం త్యజించాలి. అన్నీ తెలిసినదానివి. వేరుగా చెప్పాలా?"

"నిజమే కానీ నేను వుండలేను మధూ. ఇంతకాలం ఇన్నేళ్ళు నేననుభవించిన ఒంటరితనాన్ని నేనింకా ఒక్కక్షణం కూడా భరించలేను, నీతో నన్ను తీసుకెళ్ళిపో మధూ, ఈ జైలు నించి నన్ను తప్పించి పుణ్యంకట్టుకో," ఆవేశంగా అంది.

మాధవ్ నవ్వేడు.

"అలాగే," అన్నాడు.

"నిజంగానా ?"

"ఊఁ నిజం."

"నాకు తెలుసు నీ మనసు," అంది అతని చేతిలో చెయ్యివేసి నిమురుతూ.

మాధవ్ చాలాసేపు మిలిట్రీలో తనెలాపుంటాడో పైఆఫీసర్స్‌కి తనంటే ఎంత ఇష్టమో. డ్యూటీ ఎంతకష్టతరమైందీ, అక్కడ అందరూ కలిసి చేసుకొనే పార్టీలు, చేసే డాన్సులగురించి వివరిస్తూ చెబుతుంటే చాలా ఆసక్తిగా వింది జయ.

"మేజర్ వర్మని ఒకాయనవున్నాడు. చాలా సరదామనిషి. ఆయనకో కూతురుంది. అప్సరసే అనుకో. నన్నుచేసుకోవాలన్న కోరిక పాపం."

జయ మూతి ముడుచుకొని "చాల్లే బడాయి" అన్నట్టుచూసి

"మరెందుకు చేసుకోలేదు ?" అడిగింది.

"నువ్వు ఊఁ అంటే ఈ క్షణంలో చేసుకుంటాను" అన్నాడు.

"నాకేం భయమా ? అయితే వెళ్ళి దాన్నే కట్టుకో" అంది లేచి నించుంటూ.

"చూసేవా చూసేవా అమ్మాయిగారి బండారం అప్పుడే బయటపడిపోయింది" అంటూ నవ్వేశాడు మాధవ్.

"వెళ్దాం ఆలస్యం అయితే మేడమ్...." అంది.

మాధవ్ లేచి నించున్నాడు.

జయకి చేతినందించి అన్నాడు.

"ఇన్ని మెట్లు దిగగలవా లేక ఎత్తుకోమంటావా ?"

"ఎత్తుకుంటాను అని మాట ఇస్తే, ఈ మెట్లు దిగలేననే చెప్తాను."

"సరే ఈ అదృష్టాన్ని నేనెందుకు పోగొట్టుకోవాలి"అంటూ అమాంతం జయని పైకెత్తేశాడు మాధవ్.

"అమ్మో నన్ను దించు బాబూ"

"దించను."

"ఏమిటి అల్లరి, అందరూచూస్తారు నా కసలే సిగ్గు."

"దానికి కొంత ఖర్చు అవుతుంది."

"ఏమిటో చెప్పు."
"ఓ ముద్దుకావాలి."
"ఛీ"
"'ఛీ' అనుకొంటే తప్పదు మరి."
"మొండివాడివి బాబూ. దింపుమరి."
"ఒప్పుకున్నట్టేనా ?"
"ఆఁ."
మాధవ్ జయని దింపుతూనే అమాంతం చుట్టేసి ముద్దులతో నింపేశాడు.
"చాలు ఇక పద," అంది.
మాధవ్ జయని దింపేసి వెళ్ళిపోయాడు.
కళావతి హాల్లో ఎదురుగా కూర్చునివుంది. ఆమెని చూస్తూనే జయ దోషిలా మాటా పలుకు లేకుండా నిలబడిపోయింది.
"ఎక్కడికెళ్ళావ్ ?"
"..............." జయ మాట్లాడలేదు.
"మొన్న నీకు ఓసారి చెప్పాల్సింది చెప్పాను. నిన్ను నా సొంతబిడ్డలా పెంచాను. అర్థం చేసుకోడానికి ప్రయత్నించెయ్ జయా, లేకపోతే.... నిన్ను ఎక్స్పెల్ చేయవలసివస్తుంది," అంది.
చాలావరకు నృత్య కళానికేతన్ జయమీైన ఆధారపడింది ప్పుడు. అందుకనే గట్టిగా చెప్పలేకపోతోంది కళావతి. కానీ ఆ మాటలకే జయ సున్నితమైన మనసు బాగా దెబ్బతింది. ఆ రాత్రి భోజనం మానేసి వెక్కి వెక్కి ఏడుస్తూ పడుకొంది జయ.
కల్పన ఊరడించినా ఊరుకోలేదు జయ.

* * *

బెజవాడ రైస్‌మిల్లర్స్ హాలులో జయ ప్రోగ్రాం ఆ రోజు చాలా బాగా జరిగింది. అందరి పొగడ్తలతోనూ, అభివందనల తోనూ జయ ఉక్కిరి బిక్కిరి అయింది.
కానీ యింత జరుగుతున్నా ఏదో లోటు ఆమె మనసులో లోటు లేకపోలేదు. ఆ ప్రోగ్రాం ఏర్పాటు చేసిన రైస్ మిల్లర్ రామదాసు జయకి ప్రత్యేకించి రెండువేల రూపాయలు బహు మానంగా యిచ్చాడు. తనింతవరకూ కనీవినీ ఎరగలేదన్నాడు.

అలాంటి నృత్యం ఎక్కడా చూడలేదన్నాడు. కళావతి గర్వంగా జయని దగ్గరికి తీసుకొని నుదుటిపైన ముద్దుపెట్టుకొంది.

"అంతా ఆ నటరాజు దయ" అంది కళావతి.

పదిగజాల దూరంలో ఆరడుగుల ఎత్తులో నిలబడి ఇదంతా చూసిన మాధవ్ హుందాగా నడుస్తూ వస్తుంటే జయ మనసు ఆనందంలో మునిగిపోయింది.

చేతిలోని నటరాజ విగ్రహాన్ని జయకి అందించి అభివందనలు చెప్పాడు మాధవ్.

"ఇవన్నీ నాకనవసరం. నువ్వొచ్చావు అంతేచాలు" అంది.

"రాకుండా వుంటానని ఎలా అనుకున్నావు?" అడిగాడు.

"నాకు చెప్పే అవకాశం లేకపోయింది. కోపంవచ్చిందనుకున్నాను" అంది.

అంతలో కళావతి అక్కడికొచ్చింది. మాధవ్‌కేసి చురచురా చూసి–

"ఎవరు?" అంది జయ నుద్దేశించి.

జయ కంగారుపడింది.

"ఈయన.... ఈయన...."

"కెప్టెన్ మాధవ్" అంటూ పరిచయం చేసుకున్నాడు.

"మీకు జయ తెలుసా?"

"ఆఁ"

"ఎలా?"

"బలేవారే, జయ ఎవరో ఏమిటో తెలియకుండానే ఇక్కడికొచ్చాననంటారా. పేరు ప్రఖ్యాతి, కీర్తి ప్రతిష్ఠ, మీ నృత్యకళానికేతన్‌కి మకుటాయమానం అయిన ఈ అందాల రాసి ఎవరికి తెలీకుండా వుంటుంది?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు మాధవ్.

కళావతి గర్వంగాచూసి

"అవునవును మీ లాంటివారి ఆదరాభిమానాలుంటె అదే పదివేలు" అంది.

"ఇది మొదటిసారికాదు. మీ జయ నాట్యప్రదర్శన ఎక్కడ జరిగితే అక్కడ నేనుకూడ వుంటాను. ఒక్క మాటలో చెప్పా

లంపే నే నీమెకి ఫాన్‌ని. ఇలాంటి కళాకారిణిని తయారుచేసిన మీకు నిజంగా మన ఆంధ్రదేశం ఋణపడిపోతుంది." అన్నాడు ఆంగ్లంలో.

కళావతి పొంగిపోయింది అతని మాటలకి.

"థాంక్యూ, థాంక్యూ" అంది.

మాధవ్ జయా కళ్ళతోనే మాట్లాడుకున్నారు. కళావతి జయని వెంటబెట్టుకొని అక్కడ్నించి వెళ్ళిపోవడంతో మాధవ్ నిరుత్సాహంగా వదిలాడు.

హోటల్ పనోరమలో కళావతి బృందం దిగారు. రైస్ మిల్లర్ రామదాసు నాట్యబృందాన్ని లాడ్జివగ్గర దింపే నిమిత్తం వచ్చాడు.రామదాసు నలభై పైబడ్డ మనిషి. వెంట్రుకలునెరిసాయి.గ్లాస్గో లాల్చీ సంచెలోనూ, కళ్ళకి పెట్టుకొన్న గోల్డ్‌ఫ్రేం కళ్ళద్దాల్లోనూ చేతి వ్రేళ్ళకున్న బంగారపు ఉంగరాల్లోనూ, పెదాలమధ్య వెలిగే డన్‌హిల్ సిగరెట్లోనూ- చూడగానే అతనెంతగొప్పవాడైందీ ఎంతపలుకుబడి గలవాడైందీ చాలా తేలిగ్గా అంచనా వేసుకోవచ్చు. రామదాసు జయని అదేపనిగా మెచ్చుకున్నాడు. జయని చూశాక సినిమా తీద్దామన్న కోరిక కలిగిందన్నాడు. కళావతి నృత్య కళా నికేతన్‌కి ప్రభుత్వంనించి గ్రాంట్లు యిప్పిస్తాననీ ఇంకా ఎన్నో హామీలు యిచ్చాడు. కళావతి అతనికిగల కళాభిమానానికి చాలా సంతోషించింది. రామదాసు కూడా వాళ్ళతోపాటే భోజనం చేశాడు. ఎప్పుడు ఎలాంటి సహాయం కావాలన్నా తననించి తీసుకోవచ్చను భరోసా యిచ్చాడు. అటు తర్వాత వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళాడు. మర్నాడుదయం గోల్కొండ ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరి హైదరాబాదు వచ్చేశారు జయా వాళ్ళు.

ఆరోజంతా బడలికగా వుండటంచేత అసలు లేవలేదు జయ.

మర్నాడు ప్రతి పేపర్లోనూ తన ఫోటోతో సహా మెచ్చుకొంటూ ప్రసంగిస్తూపడింది.

జయ గర్వంగా తనని తానోసారి అద్దంలో చూసుకొంది.

జీవితం అనేది ఎంత చిత్రమైందో అనుకొంది. లేకపోతే అప్పుడే అమ్మతోపాటే తనూ పోయుండేది. జయ కళ్ళలోకి నీరు సుడులు తిరిగింది.

"అమ్మా," అనుకొంది. ఆ అమ్మ బతికుంటే యివాళటి రోజున ఎంత పొంగిపోయేదో."

తనకంటూ ఎవరూ లేరు. తన ప్రతిభకి తనే మురిసిపోవాలి. ఇంతకాలం జరిగిందదే. కానీ ఈరోజు తన సర్వస్వం అనుకునే మధూ వున్నాడు, తనతోపాటు ఆ సంతోషాన్ని పంచుకొనే మనిషి తనకున్నాడు.

ఇంతకాలం తను గడిపిన జీవితం వేరు. ఇప్పుడు వేరు.

ఇదివరలో నిరాశ చోటుచేసుకొన్న బతుకులో ఇప్పుడు ఏదో ఆశ, నమ్మకం ఏర్పడినయి. అది ఆశకాదు. నిజం. తన జీవితం పూలబాట కాబోతున్న తరుణం ఆసన్నమయింది. అంత కన్నా అదృష్టం ఏం కావాలి?

మరో వారం రోజుల్లో రవీంద్ర భారతిలో ప్రోగ్రాంవుంది. ఆ ప్రదర్శనకి ఫారెన్ డెలిగేట్స్ వస్తున్నారు. ఆ రోజు ప్రోగ్రాంలో జయకే ఎక్కువ ప్రాముఖ్యతవుంది.

ఆ సాయంత్రం జయని చూడ్డానికి పనిగట్టుకొని మరీ రామదాసు బెజవాడనించి వచ్చేడు.

"ఇలా వచ్చేరే!" అడిగింది కళావతి వెనకనించి తరుము కొచ్చినట్లుగా వచ్చిన రామదాసుని.

"నేనో నిశ్చయానికొచ్చాను," అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ రామదాసు.

"ఏమిటి?"

"నేను సినిమా తీస్తున్నాను. జయని హీరోయిన్‌గా బుక్ చేయాలనొచ్చాను," అన్నాడు.

కళావతి కొన్నిక్షణాలు మాట్లాడలేదు.

"ఇందులో మీరు అనుమానించాల్సిందేమీలేదు. మీకు అంగీ కారం అయితే ఎగ్రిమెంట్ పైన సంతకం చేయించండి" అన్నాడు.

కళావతి కొంతసేపు ఆలోచించి అన్నది.

"మేం కళకోసం పాటుపడేవాళ్ళమే కానీ సినిమా వ్యామోహం ఎవరికీ లేదిక్కడ. అయినా సినిమా పరిశ్రమలోకి రావడం అంటే పద్మవ్యూహంలో అడుగుపెట్టడమేనని నా అభి ప్రాయం.

"ఏదో ఈ డాన్స్ నేర్చుకొంటూ ప్రదర్శన లిస్తూ జీవి తాన్ని నటరాజుకి అంకితం చేసుకుంటుంది జయ"

"జయ అభిప్రాయం ఏమిటో తెలుసుకోండి" అన్నాడు.

కళావతి చిరాకు పడింది అతని మాటలకి.

"జయకి నా అనేవాళ్ళు లేరు. నేనే ఆమెకి సర్వస్వం. తల్లిని గార్డియన్‌ని అన్నీ నేనే. నా మాటని తన మాటగానే అను కొంటి. లేదూ అనుకొంటె పిలుస్తాను మీరే వింటారు" అని జయ కోసమని కబురుచేసింది. జయ బయటికి వెళ్ళిందని చెప్పారు. కళావతి కోపంతో రెచ్చిపోయింది. జయ ఈమధ్య తరచుగా బయ టికి వెళ్ళిపోతోంది. ఈ రోజు గట్టిగా మందలించాలని నిర్ణయించు కొంది కళావతి.

"సారి. జయ బయటకెళ్ళింది"అంది కళావతి.

"మళ్ళీ కలుస్తాను" అని వెళ్ళిపోయాడు రామదాసు.

కళావతి టైం చూసుకొంది.

రాత్రి ఎనిమిదిన్నరయింది. మెల్లగా హాల్లోంచి బయట కొచ్చి కాంపౌంటు వాల్ గేటుదగ్గరకెళ్ళి నించుంది. కళావతిలో ఆలోచనలు రక రకాలుగా సాగుతున్నాయి.

జయ యెందు కిలా చేస్తోందీ అర్థంకావడంలేదు. తనకి తెలీకుండా యే పనీ చేయని జయ యిలా ఎందుకు చేస్తోంది?

పదినిముషాల తర్వాత మోటార్ సైకిల్ పైన కొద్దిదూరంలో జయని ఎవరో దింపివెళ్ళడం చూసింది. మోటార్ సైకిల్ పైనున్న వ్యక్తిని కూడా కళావతి పోల్చుకొంది. కోపంతో కళ్ళెర్రబడ్డాయి. కళావతికి ముక్కుపుటాలు ఎగిరిపడ్డాయి కనుబొమ్మలు ముడిపడి నాయి.

గేటుదగ్గరే నించునున్న కళావతిని చూడగానే జయ పై ప్రాణాలు పైనే ఎగిరిపోయినయి చెవట్లు పట్టేశాయి.

"ఎక్కడికెళ్ళావ్ ?" గేటులోనే నిలేసింది కళావతి.

"జయ నేలచూపులు చూసింది.

"మాట్లాడవే ?" గద్దించింది.

"బయట కెళ్ళాను" అంది.

"అతితెలివి చూపకు. బయటకెళ్ళావని తెలీక అడిగిందానిలా

అడుగుతున్నా ననుకుంటున్నావా? ఎంత కాలంనుంచి సాగిస్తున్నా విది ఎవరంను?"

జయకి ఛర్నాకోలు దెబ్బల్లా తగిలాయా మాటలు. ఛెంప ల్లెర్రబడ్డాయి- కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది. ఒక్కసారి తలెత్తి కళావతి మొహంలోకి చూసింది జయ.

"అతను నాకు బావ అవుతాడు" అంది మెల్లగా.

కళావతి అసహ్యంగా చూసింది.

"సంస్థపేరుని మటిపాలు చేస్తున్నావుకదే. దిక్కు లేనిదాని వని చేరదీస్తే, ఇన్నాళ్ళులేని ఓ బావ నీకు ఈ రోజు వూడిపడ్డాడా? ఎవడే వాడు?"

"నేనేం కానిపని చేయడం లేదు. మీరు నమ్మినా నమ్మక పోయినా అతను నాకు బావే. చిన్నప్పుడే విడిపోయాం. కాకతాళీ యంగా కలుసుకున్నాం. నా అనేవాళ్ళులేక ఇంత కాలం ఒంటరి తనంతో కుమిలిపోయిన నాకు అతడు దేవుళ్ళా కనబడ్డాడు, మేము పెళ్ళి చేసుకోబోతున్నాము" అంది కోపంతో జయ.

కళావతి నోట మాటలేకుండా నించుండి పోయింది. జయ నోరు విప్పి అలా మాట్లాడుతుందని కలలోకూడా వూహించలేదు కళావతి.

"లోపలికి పద" అంది తేరుకొని.

జయ నడుస్తుంటె వెనకనే నడుస్తోన్న కళావతికి ఎన్నో ఆలోచనలు: ట్టిపీడిస్తుంటే వణుకుపుట్టుకొచ్చింది. జయ ఈవిధంగా తయారవుతుందని కళావతి అనుకోలేదు.

కళావతి ఆగిపోయింది.

జయ నడుస్తోంది. ఆగలేదు.

జయకీ ఆమెకీ మధ్య దూరం పెరిగిపోతోంది. జయ ఆధా రంగా కళానికేతన్ నడుస్తున్న మాట వాస్తవమే అయినా, తన చుట్టూ ఏర్పరచుకొన్న గిరిని చెరిపివేసుకోలేకపోతోంది కళావతి. క్రమశిక్షణ తన వూపిరి. జయకోసం దాన్ని వదులుకోటం అనేది తనకి సాధ్యమా? అనిపించింది.

జయని పిలిపించింది తనగదిలోకి. జయ వచ్చి కళావతి ఎదురుగా కూర్చుంది,

"జయా!" పిలిచింది. ఆ గొంతు చాలా సౌమ్యంగా వుంది ప్పుడు. జయ ఆ పిలుపుకి ఆశ్చర్యపోయింది.

జయ తలెత్తి చూసింది.

"నా మాటలకి కోపం వచ్చిందా?" అడిగింది.

జయ మాట్లాడలేదు. కళావతి పెదవులపైన సన్నని నవ్వు ఓ క్షణం వెలిగి అంతలోనే మాయమయింది.

"జీవితం అంటే బొమ్మలాటకాదు జయా, అందమైన ఆడ పిల్ల కనపడితే అందుబాటులోకి తీసుకోడానికి మగవాడు ఎన్నో ప్రయత్నాలు చేస్తాడు. అందులో ప్రేమ అన్న రెండక్షరాలు ముందు చోటుచేసుకుంటాయి. ఆడది ఆ రెండక్షరాల దగ్గరేనమ్మా మోసపోయేది, జీవితాన్ని పోగొట్టుకొనేది."

"ప్రేమ మోసమంటారా? లేక మోసంచేస్తుందా?" అడిగింది జయ.

కళావతి నవ్వింది.

"దాన్ని నువ్వెలా పిలిచినా ఫరవాలేదు. కానీ ఓమాట చెప్పు. ప్రేమ తప్పితే జీవితానికి మరో సమస్యే లేదా? అది కాకపోతే విరహం, వేదాంతం, అంతేనా! ప్రేమించానని చెప్పే ఏ మనిషినీ నమ్మకూడదు. నిజంగా ప్రేమించినవాడికి ఆ ప్రేమని విప్పి చెప్పు కోడానికి మాటలే వుండవు. అసలు నోరు పెగలదు. కోరుకోడం తప్పుకాదు. కాని ఆ కోరికలు తీరవని తెలిసినప్పుడు సాధ్యపడే వాటిని కోరుకొని తేల్చుకోవాలి. అప్‌కోర్సు కోరికల్ని అదుపులో పెట్టుకొనే శక్తి మహానుభావులకే చెల్లుతుంది. అందుకే నీకు చెబు తున్నాను. జీవితం రాగబంధాలతో ముడిపడింది. రాగద్వేషాలతో నిండి పోతుంది. ఆఖరి క్షణాల్లో భవబంధాల్నుంచి తప్పించుకొని పెంచు కొన్న మమతల్ని, ఆపేక్షానురాగాల్ని నావాళ్ళనుకొన్నవాళ్ళనీ, సంపాదించిన సంపదల్ని బతికినంతకాలం పట్టుకొని ప్రేలాడే కాలం, మతం, పరువు, మర్యాదలు అన్నీ వదిలి మట్టిలో మట్టిగా కలిసిపోవాలి. ఇక్కడకు నిన్ను తీసుకొచ్చినప్పటి నీ పరిస్థితి ఏమిటో ఒక్కసారి గుర్తుచేసుకో. జీవితం ప్రేమ మయమూ, వేదాంతమేకాదు. నేనే నిన్ను తీసుకువచ్చి వుండకపోతే ఈపాటికి నువ్వు ఏమైవుండేదానివో ఆలోచించు. నువ్వంటే నాకు గల

ప్రత్యేకమైన ప్రేమతోనూ, అభిమానంతోనూ ఇంతగా చెప్పాను.

కళావతికి తనపట్లగల అందోళనకి సరైన కారణాలు తెలి లేక తేలిగ్గా వూపిరి తీసుకుంది జయ.

కళావతి గట్టిగా నిట్టూర్చింది।

మీ అందర్నీ నేనింత కట్టుబాట్లలో ఎందుకుంచుతున్నానో అదీరోజు మీకు తెలీదు. దానికి అనుభవం కావాలి.

నాకీ సంఘం అంటేనే ఓ విధమయిన విముఖత। సాటి మనిషికంటే పశుపక్ష్యాదులకి అభిమానిస్తే విశ్వాసంతో పడి వుంటాయి. ఇంతవరకూ యెదురయిన ప్రతి మనిషిలోనూ యేదో ఒక రూపంలో స్వార్ధమే కనుపించింది, స్వచ్ఛ అనేదే కనబడ లేదు. వెంటనే కాకపోయినా కాస్త ఆలస్యంగానైనా నేను గ్రహించగలను."

ఆమె మాటలకి జయ మాట్లాడలేదు.

కళావతి గ్లాసులో మంచినీళ్ళని త్రాగి మళ్ళీ చెప్పింది.

"నీలోని నాట్యకళని అభిమానించి ఆరాధించే వాళ్ళుంటారు అలాగే నీ అందానికి దాసోహమని నీ పొందుకోసం అంగలార్చే వాళ్ళుంటారు. రామదాసు మొన్న బెజవాడలో నీ డాన్స్ ఏర్పాటు చేశాడు. ఈ సాయంత్రం వచ్చి సినిమా తీస్తానని చూస్తున్నాడు. సినిమా ఎర చూపించి నిన్ను లోబరుచుకోవాలన్న నీతి వాడిది. నిన్నొక్క రాత్రి బయటికి పంపిస్తే రెండు వేలిస్తానని బంజారా హిల్స్‌నించి ఎవడో ఫోన్ చేశాడు. ఎవడో రాజకీయ నాయకుడొస్తున్నాడట. వాడికోసం పంపమని పత్తిడి చేస్తున్నారు అఫిషియల్ లెవెల్లో ఇవన్నీ నీకు చెబితే బాధపడతావని ఎప్పుడూ నీకు తెలీనీయలేదు, చాలామంది చూపు నీ వయసుమైన వుంది. అది అభిమానం కాదు. కోరిక. ఓ నీచమయిన వాంఛకోసం నిన్ను గిరిలోకి లాగాలని ఉచ్చుతాడు బిగిస్తున్నారు. అందుకే నువ్విలా విచ్చలవిడిగా తిరిగితే అప్రదిష్టని పోగుచేసుకొంటావు. నేనింత కాలం కన్న నా కలలు మట్టిపాలవుతాయి.

జయా,

అందుకే నేనో నిర్ణయాని కొచ్చాను.

నువ్వికముందు నా అనుమతిలేనిదే కాలు బయటపెట్టడానికి వీల్లేదు పద" అని నించుంది.

జయతోపాటే కళావతి బయటికొచ్చింది. జయ చేతిని తన చేతిలోకితీసుకొని సరాసరి నటరాజువిగ్రహంముందుకి తీసుకెళ్ళింది.

జయకి గుండెలుఅదిరాయి. నటరాజుకేసి దిగులుగాచూసింది ఆవేదనగా చూసింది. భయంతో చప్టల్లు పట్టాయి.

"నేను చెప్పే మాటలు చెప్పు" అంది కళావతి.

"అలాగే" అంది జయ కూడదీసుకొన్న ధైర్యంతో.

కళావతి జయ జీవితాన్ని నటరాజుకి అంకితం చేయించింది. ఒట్టుపెట్టించింది.

ఇలా జరుగుతుందని ఏమాత్రం వూహించని జయ కుళ్ళి కుళ్ళి ఏడుస్తుంటే కల్పన విస్తుబోయింది.

స్నేహితురాలిని, ఆమె పడుతోన్న వేదనని చూస్తుంటే కల్పన గుండె తరుక్కుపోయింది. మేడమ్ చేసినపని చాలా దారుణంగా అనిపించింది కల్పనకి.

జయని జాలిగాచూస్తూ ఓదార్చింది. నచ్చజెప్పింది. కానీ ఆ ఓదార్పు జయని వూరడించలేదన్న సంగతి కల్పనకి తెలీని విషయంకాదు.

ప్రేమించిన మనిషిని, చాలా సన్నిహితంగా తిరిగిన మనిషిని, తన కోసం ప్రాణాన్నిచ్చే మనిషిని, తనకోసం పిచ్చి పట్టినట్టు తిరిగే మాధవ్‌ని తనెలా మరచిపోగలదు? ఎలా దూరం చేసుకోగలదు?

మాధవ్ తనని ముట్టుకుంటున్నాడు.

పెదవులందుకొంటున్నాడు.

హృదయానికి హత్తుకుంటున్నాడు.

అది ప్రేమ. అదీనాటిదికాదు, ఎప్పటిదో? చిన్ననాటినుంచి మొగ్గలు తొడగి పువ్వుగా విరిసిన ఓ రాగబంధం. అనురాగబంధం. ప్రేమబంధం అది.

మాధవ్‌కోసం తను, తనకోసం మాధవ్ ఏమిపోగొట్టుకో డానికైనా రెడీగావున్నారు.

"ఇది ప్రేమ.

కోరికకాదు.

అది ప్రేమ.

మోసంకాదు.

ఇది ప్రేమ. ప్రేమ ప్రేమే అవుతుంది. అది వంచనకాదు వాంఛకాదు. నిజం. నిజం ఇది ప్రేమ," అని జయకి గట్టిగా అరవాలనిపించింది. ఇప్పుడు మాధవ్ ఉన్నతమైన స్థితిలోవున్నాడు అతను కావాలనుకొంటే తనలాంటి అందిదొరకదా! తననే గుండెల్లోపెట్టుకొని ఆరాధిస్తున్న అతనిది ప్రేమకాదా!

కళావతికి ప్రేమంటే తెలీదు. పెళ్ళికాని బ్రహ్మచారిణి. నాట్యాచారిణి. అందరూ తనలానేవుండిపోవాలనే అభిమతమే ఆవిడ దైతే అది మహాపరాధమే అవుతుంది. ఆ సంగతి విస్మరించింది కళావతి.

తనని, తనలాంటివాళ్ళని చేరదీసి, పెంచి పెద్దచేసి ఓమంచి స్థితిలోకి తీసుకొచ్చి వుండవచ్చు. అలానిచెప్పి మనసులోని కోరి కలకి అన్నిటికీ సర్వం తానే అధికారిణి అయినట్టుగా చెలామణీ అవడానికి ప్రయత్నించడం అమానుషం. అది తెలివితక్కువతనం కూడా. వయోపరిమితి తీరితే పిల్లలపైన తల్లితండ్రులకే అధికారం వుండదు, స్వేచ్ఛ స్వాతంత్రాలు వస్తాయి. అలాంటిది........ ఈమె మనఃప్రవృత్తి ఏమిటో బొత్తిగా అర్థంకాలేదు జయకి.

కల్పన కలతనిద్రలోకి జారిపోయింది.

జయలేచి అద్దంముందు నించుంది.

భోజనం చేయనికారణంగా కడుపులో మంటగావుంది. ఏడ్చి ఏడ్చి మొహం పీక్కుపోయింది. కళ్ళు ఉబ్బినయి. జుత్తు చెదిరి పోయింది. మొహంపైకిపడ్డ తల వెంట్రుకలని నిర్లక్ష్యంగా ఎడం చేత్తో వెనక్కి తోసుకుంది.

దేవుడు తన జీవితంతో ఆటగాని ఆడ్డంలేదుకదా. అన్న అనుమానం కలిగింది.

నిజమే!

కానీ తనెవరికి ఏవిధమైన అపకారమూ చేసి ఎరుగదు. మర లాంటప్పుడు తనకీ విషమ పరీక్షలెందుకు?

"భగవాన్, నా అనేవాళ్ళు లేని అనాథని నేను. ఆడపిల్లని.

వీడతెగితే నీడదొరకని స్థితిలోవున్న దౌర్భాగ్యురాలిని. నన్ను రక్షించు. ఈ విషమ రీక్షని ఈ పిరి మనిషి భరించలేదు. దయచేసి నన్ను రక్షించు, ప్లీజ్," అంటూ ఏడ్చింది.

మెల్లగా నాట్యశాలకి వచ్చింది జయ.

ఎదురు నటరాజు.

నటరాజుని తీక్షణంగా చూసింది జయ.

నటరాజు చలించలేదు. ఎప్పటిలా ఏమీ ఎరగనివాడిలా కన బడ్డాడు.

"నువ్వు దేవుడివి. దేవ దేవుడివి. ఏ రూపంలోనైనా పడుండగలవు. కానీ నేను సామాన్యమైన మనిషిని. నీలా ఓ రాయిగానో రప్పగానో పడుండటం నాకు సాధ్యం కాదు. జీవితాన్ని కళకోసం నీకోసం అంకితం చేసుకొని, నా మాధవ్‌ని విడిచిపెట్టి జీవచ్ఛవంలా నేను పడుండలేను. నాకు నువ్వే దిక్కు. నన్ను కాపాడు దయచేసి నన్నీ నాలుగుగోడల మధ్యనించి తప్పించి పుణ్యం కట్టుకో దేవుడూ" అని బావురుమని ఏడుస్తూ నిలుపునా నేలపైన కూలిపోయింది జయ.

కల్పన సరిగ్గా అదే సమయంలో అక్కడికి వచ్చింది. జయని మెల్లగా లేవనెత్తి గదిలోకి తీసుకెళ్ళింది. జయ ఆ రాత్రంతా ఏడుస్తూనే వుంది.

* * *

జయ రెండు రోజుల్లో చాలా చిక్కిపోయింది. వేళకి భోజనం అదీ చేయటంలేదు. వ్యాయామశాలకి వెళ్ళటంలేదు. రిహా ర్సల్స్ చేయడంలేదు. కళావతి నచ్చచెప్పడానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్న ప్రయత్నాంగానే మిగిలిపోయింది. కళావతి మాట లని కళ్ళప్పగించి విన్నదేకానీ తిరిగి ఏ విధమయిన సమాధానం చెప్పలేదు జయ.

మాధవ్ మోటార్ సైకిల్ పైన అటూ యిటూ తిరుగుతూనే వున్నాడు. జయ చూస్తూనే వుంది. ఆమెని చూస్తుంటే కల్పనకి ఆందోళనగా వుంది. ఓసారి జయ అతన్ని కలుసుకుంటేగాని మళ్ళీ సరయిన ధ్యాసలోకి రాదేమో ననిపించింది.

"నువ్వోసారి మాధవన్ని కలవరాదూ" అంది.

జయ నిర్వికారంగా చూసింది నవ్వింది. ఆ నవ్వు పెదవుల పైన సజావుగా తేలిపోయింది.

"కలిసి నా బతుకు బండలయిపోయిందని చెప్పనా?"

"ఇప్పుడేమయింది" కల్పన మామూలుగా అడిగింది.

"నటరాజు దగ్గిర ఒట్టు పెట్టించింది" అంది దిగులుగా,

కల్పన తమాషాగా నవ్వేసింది.

"నువ్వేం చిన్నపిల్లవికాదు. ఇష్టంలేని పనిని ఎవరు చేయించినా అది చెల్లదు. అయినా దాని నమ్మకమేగానీ అసలు దేవుడు లేడు దెయ్యమూలేదు. ఇక పరిస్థితులంటావా, మన తెలివితేటల పైనా, చేతలపైనా ఆధారపడతాయి. వెళ్ళి అతన్ని కలుసుకొని అన్నీ మాట్లాడు. నీ కొచ్చిన భయంలేదు. నేనున్నాను" అంది.

"రేపు ప్రోగ్రాం వుందిగా" అంది మెల్లగా.

"వుండే వుంది. ఈవేళే అతన్ని కలుసుకో."

"మేడమ్‌కి తెలిస్తే?"

"అవంతా నేను చూసుకుంటాను కదే!" అంటూ నచ్చజెప్పి కల్పన జయని బయటికి పంపింది. ఆ సమయంలో కళావతి కళానికేతన్‌లో లేదు. మర్నాడు ప్రోగ్రాం వుండటంచేత బయటికి వెళ్ళింది.

* * *

నౌబత్‌పహాడ్ పైన మాధవ్ ఒడిలో మొహం దాచుకొని వెక్కివెక్కి ఏడ్చింది జయ. మాధవ్ కేంచేయడానికీ పాలుపోలేదు.

జయ తలపైన చేత్తో నిమురుతూ మెల్లగా అన్నాడు.

"సుఖంగా వుండేదానివి. ఇదంతా నామూలంగానే జరిగింది. నన్ను క్షమించు జయా"

"నేను ఇప్పుడేం చేయాలి?" అడిగింది లేవకుండానే,

"ఫ్రంట్ నించి పిలుపొచ్చింది. రేపు ఏడు గంటల ప్లేన్లో వెళ్ళిపోతున్నాను." చెప్పాడు మాధవ్.

జయ పక్కనే బాంబుపడినట్టుగా ఉలిక్కిపడింది. చివ్వున తలెత్తిచూసింది. ఆ కళ్ళలోని భయాన్ని మాధవ్ గమనించాడు.

మాధవ్ గంభీరంగా ఎటో చూస్తున్నాడు.

"వెళ్ళిపోతున్నావా?" అంది

ఆ మాట అడుగుతున్నప్పుడు పల్చని ఆమె పెదవులు అదిరాయి. కళ్ళలో నీరు తిరిగింది, మాధవ్ తలతిప్పిచూశాడు. జయ భుజాంచుట్టూ చేతులువేసి దగ్గరిగా తీసుకున్నాడు. జయ అతని మెడచుట్టు చేతులువేసింది. ఒకరినొకరు దగ్గరగా, మరీదగ్గరిగా, ఇంకాదగ్గరిగా చేరారు. ఒకరి కళ్ళలోకి ఒకరు పిచ్చిగా చూసుకొన్నారు. అంతే! జయని గట్టిగా కౌగిలించుకొన్నాడు.

"వెళ్ళాలనిలేదు. కానీ వెళ్ళక తప్పదు. నాది మామూలు ఉద్యోగం కాదుగా! దేశంకోసం ప్రాణంకూడా ఇవ్వాలి అవసరం అయితే, దేశమాత పిలుపు అందింది.వెళ్ళకుండా ఎలావూరుకోను."

జయ అతని మొహన్ని దగ్గరిగా లాక్కొని పెదవుల్ని అందుకుంది. మాధవ్ ఆవేశంగా జయని ఉక్కిరిబిక్కిరిచేసేశాడు.

జయ శూన్యంలోకి చూస్తూ కూర్చుంది,

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అడిగాడు,

"అసలు నువ్వెందుకు కనబడ్డావా అని ఆలోచిస్తున్నాను." అంది జయ.

"కనబడినందుకు బాధపడుతున్నావా!"

"అవును. ఆప్యాయతా, ఆదరణాలేకుండా పెరిగి. హృదయము కరుడుగట్టుకుపోయిన నాలో తిరిగి చైతన్యాన్నికలిగించావు నిద్రపోతున్న హృదయాన్ని తట్టిమేలుకొలుపుతో నిద్రలేపావు. తిరిగి యధాప్రకారం నా బ్రతుకుని నా కొదిలి నీ దారిన నువ్వు వెళ్ళిపోతున్నావు. ఎందుకు కనబడాలి ఎందుకెళ్ళిపోవాలి! ఇది నా ప్రశ్నకాదు బాధ. అది అర్ధంచేసుకో" కోపంగా అన్నది జయ.

సిగరెట్ వెలిగించి ఆలోచనల్లో పడిపోయాడు మాధవు.

"మధూ."

"ఊ"

"నా మాటలు నీకు కోపంగాని తెప్పిస్తున్నాయా, ఏం చేయను చెప్పు. నువ్విప్పుడు వెళ్ళిపోతే తిరిగినాకు కనిపిస్తావన్న నమ్మకం నాకు లేదు. మేమ్ ఏ క్షణంలో ఏం చేస్తుందో తెలీదు. ఒక్కక్షణం చేయి జారితే అది తిరిగి రాదు మధూ నా జీవితం అనుభవించాను. అందుకే ప్రతి చిన్న విషయానికీ భయపట్టం అలవాటయిపోయింది" మధూ సిగరెట్ అవతల పారేసినాడు.

"లే వెళదాం" అన్నాడు.

జయ భయంగా చూసింది తొమ్మిదిన్నరయింది.

"ఎక్కడికి?" అంది.

"చెప్తానుగా పద" అన్నాడు.

ఒకరిచేయి ఒకరు పట్టుకొని కొండ దిగారు. జావా వెనక ఎక్కి కూర్చుంది జయ, మాధవ్ ఎక్కడికి తీసుకువెళుతుందీ అర్థంకాలేదు జయకి.

మోటార్ సైకిల్ని గుడిదగ్గిర ఆపి-

"దిగు" అన్నాడు.

గుడి ప్రాంగణంలో అడుగు పెట్టారిద్దరూ.

లోపల తలుపులు వేసివున్నాయి. పూజారి ఇల్లుకూడా ఆ గుడి ప్రాంగణంలోనే వుంది. మాధవ్ పూజారిని నిద్రలేపాడు.

సమయంకాని సమయంలోవచ్చి నిద్రనంతా పాడుచేసిన వాళ్ళని కొత్త చికాకుగా చూశాడు పూజారి.

"పూజారిగారు మాకు వెంటనే పెళ్ళి జరగాలి," అన్నాడు మాధవ్,

జయ కళ్ళువిప్పారినాయి, అదినిజమా అన్నట్లుగాచూసింది. పూజారి వాళ్ళని అనుమానంగా చూడ్డంచూసి మాధవ్ నవ్వేడు.

"మీకేమీ అనుమానం అక్కర్లేదు. నేను మిలట్రీఆఫీసర్ని. రేపే వెళ్ళిపోవాలి. మా అమ్మగారు వూళ్ళోలేరు. అందుకే అర్జంటుగా ఇప్పుడు మా పెళ్ళి జరిగిపోవాలి."

"ఇవాళ మంచిరోజు కాదు బాబూ," అన్నాడు పూజారి.

"మంచీ చెడూ చూసే టైం నాకులేదిప్పుడు. దయచేసి ఏర్పాటు చేయండి."

"నామాట వినండి. పగవాళ్ళకికూడ ఈరోజు ముహూర్తం పెటకూడదు. రేపు సాయంత్రం అయిదు తర్వాత ఎప్పుడైనా పర్లేదు," పూజారి మాటలకి నీరసంగా చూశాడు మాధవ్.

"రేపు ఏడుగంటలకి విమానంలో వెళ్ళిపోతున్నాను. అదింటికి ఈమెకి డ్రాన్స్ ప్రోగ్రాం వుంది ఎలా?" అన్నాడు

"ఆలస్యం ఏంకాకుండా నేను ఇక్కడ చూచుకుంటాను. మీరు అయిదున్నరకి రండి. పదినిమిషాల్లో పంపేస్తాను," అన్నాడు పూజారి.

పూజారి మాటల్ని ఇద్దరూ కొట్టేయలేకపోయారు. మాధవ్ బయటకొస్తుంటే జయ అడిగింది.

"నువ్విలాంటినిర్ణయం తీసుకొన్నట్టు నాకెందుకుచెప్పలేదు?"

"ఆశ్చర్యంతో నిన్ను ముంచెత్తాలని" అన్నాడు.

"నేను కాదంటే ఏం చేసేవాడివి" అడిగింది జయ.

"నీ చెవులు మెలేసే వాడిని."

"ఓస్ అంతేనా!"

"అంతకంటే ఏం చెయ్యాలి?"

"అదికూడా నేనే చెప్పాలా?" అంటూ జయ మనసారానవ్వింది.

జయ మనసులో వున్న బరువైన ఆలోచనలు, దిగులు అన్నీ ఆ ఒక్క క్షణంలో ఎగిరిపోయినయి.

"కళానికేతన్‌కి వెళ్ళాలా యిప్పుడు?" అడిగాడు.

"మరి?"

"ఇంకెందుకు!"

"రేపు ప్రోగ్రాం వుందిగా, అందులోనూ చాలామంది పెద్దలు వస్తున్నారు" అంది.

"మరి అయిదున్నరకి కుదురుతుందా?"

"అదే అనుమానంగా వుంది."

"ఏదోలా వచ్చేయి. వెంటనే వెళ్ళిపోదువుగాని."

"అలాగే" అంది జయ,

* * *

మర్నాడుదయంనించీ అసలు తీరికనేదే దొరకలేదు జయకి. ఏపనిచేస్తున్నా మధూ గుర్తుకొస్తున్నాడు. సాయంత్రం వెళ్ళగలనా లేదా అన్న సంకోచమే ప్రక్క పీడిస్తోంది.

రెండు గంటలప్పుడు రెస్ట్ టైంలో కల్పనకి చెప్పింది జయ అసలు సంగతి.

కల్పన అమాంతం కౌగలించుకొంది జయని. చెంపపైన రెండుముద్దులు పెట్టుకొంది.

"కంగ్రాచ్యులేషన్స్," అంది ఆనందంగా.

"అంతా బాగానేవుంది. కానీ ఆరింటికి ప్రోగ్రాం వుంది, ఏంచెయ్యాలో అర్థం కావడంలేదు."

ఆ మాటలకి కల్పన ఆలోచనలో పడింది.

ఆరంభం ఎదెలాగూ అవుతుంది. ముందు ఓ అరగంట నేను చేస్తాను. ఈలోగా నువ్వొచ్చి మేకప్ చేసుకోవాలి. ఇదంతా చేసినా నువ్వు లేని విషయం మేడమ్‌కి ఎలానూ తెలిసిపోతుంది," అంది కల్పన.

"అవును."

"అందర్నీ నాలుగ్గంటలకల్లా థియేటర్ దగ్గరికి తీసుకెళ్ళాలనుకొంటోంది," అంది కల్పన,

జయ మాట్లాడలేదు.

దేవుడు వరంఇచ్చినా పూజారి అడ్డుపడటం అంటే ఇదే కాబోలనిపిస్తుందే" లేకపోతే నిన్నే అంతా పూర్తయిపోయేది।"

అంది జయ.

"ఏం పర్వా. నువెళ్ళు. నేను సర్వదా ప్రయత్నం చేస్తాను. గజ్జెలకోసమో, టైలర్ దగ్గర చీర కుట్టించుకురావడానికో వెళ్ళావని చెప్తాను." అంది కల్పన.

"సిల్లీ కారణాలు చెబితే వింటుందా?"

"నీకు పెళ్ళయిపోయిందని తెలిసేకవింటే ఎంత వినకపోతే ఎంత? ముందా మూడుముళ్ళు వేయించుకురా తర్వాత నీ మూడులక్షల అనుమానాలకి సమాధానం చెప్తాను," అంది కల్పన నివ్వేస్తూ. అందరితోపాటు నాలుగ్గంటలకి జయ కూడా రవీంద్రభారతికి వెళ్ళక తప్పలేదు. కళావతి దగ్గిరే వుండి అందర్నీ వెంటబెట్టుకొచ్చింది థియేటర్‌కి. జయ బయటికి జారుకోడానికి అవకాశం కోసం యెదురుచూస్తోంది. కళావతి తన పక్కనించి కదలటంలేదు. కదిలేలానూ లేదు.

"మేడం భామాకలాపం చీర మర్చిపోయి వచ్చాను. వెళ్ళి తెచ్చుకోనా?" అడిగింది జయ.

కళావతి కోపంగా చూసింది.

"ఇప్పుడా చెప్పేది? ఎవర్నన్నా పంపిస్తాలే" అంది.

"అది టైలర్ దగ్గరుంది" అంది జయ.

"ఛీ ఛీ, డిసిప్లెన్ బొత్తిగా కరువయిపోతోంది. సరే భామాకలాపం తీసేద్దాం" అంది.

"నాకు చాలా యిష్టమయిన అయిటము అది మేడం"

"మరేం చేస్తావు?"

"వెళ్ళి తెచ్చుకుంటాను"

"ఎక్కడో చెప్పు యెవర్నన్నా పంపిస్తాను. యీలోగా మేకప్ వేసుకో" అంది.

గుర్తులు చెప్పలేను చాలా సందులు తిరగాలి నేనే వెళ్ళొచ్చేస్తాను" అంది జయ.

"అయినా మన టైలర్ వుండగా ఎవరో టైలర్ కెందుకిచ్చినట్టు? ఆ సందులన్నీ యెందుకు తిరిగినట్టు" అని గడియారం చూసంది.

అయిదయింది.

"చూడు జయా యింక బయటికి వెళ్ళిరావడానికి టైము చాలదు. ఈసారికి ఆ అయిటం తీసేద్దాం. నువ్వు గ్రీన్ రూంలోకెళ్ళు" అంది.

ఆ మాటలకి జయ నీరసపడిపోయింది. ఆ క్షణంలో కళావతిని గొంతుపిసికి చంపేయా లనిపించింది. కల్పన ఎదురుపడి అడిగింది.

"ఏమయింది?" అని.

అంతాచెప్పి ఎటూ పోకుండా ఆ దెయ్యం ఎదురుగుండా కూర్చుంది" అన్నది జయ.

కల్పన టైం చూసింది. అయిదూ పదయింది. పదో పది నిముషాల్లో జయ అక్కడికి చేరుకోవాలి. లేకపోతే ప్లాన్ అంతా పాడయిపోతుంది. జయ చూసింది. మిగిలిన పిల్లలు మేకప్ చేసుకొంటున్నారు.

అంతలో కళావతి అక్కడికి రానే వచ్చింది.

"ఇంకా కూర్చున్నావే" అంది.

జయ మాట్లాడకుండా వెళ్ళి అద్దం ముందు కూర్చుంది. చేతి గడియారంలో అయిదూ యిరవై అయింది. ఓపక్క అక్కడ్నించి పారిపోవాలన్నఆరాటం. మరోపక్క ఏడుపూ ముంచుకొస్తున్నాయి జయకి. ఆరూ పదికి మేకప్ పూర్తయింది.

జయ అద్దంలో చూసుకొంది. కళ్ళలో నీరు సుడులు తిరి

గింది. తన బ్రతుకు తిరిగి కారుచీకట్లోకి ప్రయాణిస్తున్నట్టు అని పించింది జయకి. ఆడిటోరియం నిండిపోయింది. యింకా డెలిగేట్స్ కొంతమంది రావాలి. ముందు ఓ చిన్న మీటింగ్ వుంది. తర్వాత కార్యక్రమం ప్రారంభం అవుతుంది. యింకా ఎలాకాదన్నా గంట పడుతుంది. ఈలోగా వెళ్ళి రాగలిగితే చాలు. కానీ ఇలా మేకప్‌తో ఎలా వెళ్ళగలదా?"

మేకప్ అంతా చెరిపేసుకొని పారిపోదామనిపించిందిజయకి.

"అదృష్టహీనుల్ని బాగుచేసేవాళ్ళు ఎవరూ వుండరు." అంది కల్పన.

"నిజమే," అంది జయ.

"ఎపీశాప్ ఇప్పటికీ మించిపోయిందిలేదు. వెళ్ళు అంది.

కల్పన తీవ్రంగా అన్న ఆ మాటలకి అప్పుడుగానీ జయలో స్థిరమైన అభిప్రాయం కలగిలేదు.

"వెళ్తాను." అంది దృఢంగా.

"నీకోసం ఆటో పిలిపించి వెనక అట్టేపెట్టాను.

ఆ తలుపుతీసుకొని వెళ్ళిపో. గుడ్‌లక్. అంది కల్పన,

అయిదునిముషాల్లో ఆటోని ఖైరతాబాదు ఆంజనేయస్వామి గుడిదగ్గరికి చేర్చాడు ఆటో డ్రైవరు.

జయ గబగబా లోపలికి నడిచి పూజారిని అడిగింది మాధవ్ గురించి,

జయ పూర్తిగా మేకప్‌లో వుండడంతో పూజారి వెంటనే గుర్తుపట్టలేదు. తర్వాత జయ మాటలు విన్నాక చెప్పాడు.

"బాబుగారు చూశారమ్మా. విమానం టైం అయిందని వెళ్ళి పోయారు," అన్నాడు పూజారి.

జయ నరనాడులూ కృంగిపోయినయి. స్పృహతప్పేలా అనిపించింది. "మాధవ్ వెళ్ళిపోయాడా."

"ఇప్పుడేంచేయాలి?"

తిరిగి జీవితంలో అతన్ని చూడగలనా అనిపించింది. ఏమయితే అదేఅవుతుంది. ఇంతవరకూ వచ్చేక భయపడవలసి నగత్యం తనకి లేదనిపించింది. కేవలం కళావతి ప్రవర్తనవల్లనే ఈ రోజు ఇలా జరిగింది.

తన జీవన సర్వస్వం అనుకున్న మధూ వెళ్ళిపోయాడు. కళ్ళలోకి నీరు పొంగింది.

గబగబా బయటకివచ్చి ఆటో ఎక్కి-

"ఎరోడ్రోమ్‌కి పోనీయ్" అంది.

ఆరూ నలభై అయిదయింది. నిముషం ఓ యుగంలా వుంది జయకి. ఆ పరిస్థితిని ఎలా ఎదిరించాలో తెలియటంలేదు, మధూని ఎలాగైనా సరే చూడాలన్న. కలుసుకోవాలన్న తపన ఆమెలో వున్నాయి. ఆటోదిగి ఎంట్రన్సుటికెట్ తీసుకొని గబగబ లోపలికి వెళ్ళింది. ప్రతిసోఫాలోనూ చూసింది, ఎంక్వయిరీలో కలకత్తా ప్యాసింజర్లందరూ లోపలికివెళ్ళిపోయినట్టు తెలుసుకొంది. దిగులు పడింది. నిరాశ చెందింది. ఓ పక్క ఏడుపొస్తోంది. గబగబ మెట్లెక్కి ఎన్‌క్లోజర్‌లోకెళ్ళి నించుంది.

లక్షమందిలోవున్నా మాధవ్‌ని పోల్చుకోగలదు జయ.

మాధవ్, మాధవ్ విమానానికి పదిగజాలదూరంలో నడుస్తూ కనబడ్డాడు.

కళ్ళు మెరిసినయి జయకి. ఆ మాత్రం చాలు తనకి అతన్ని చూసింది. చూడగలిగింది.

అతన్ని కలుసుకోలేక పోవచ్చు. మాట్లాడ లేకపోవచ్చు. అతని కౌగిలిలో కరిగిపోలేకపోవచ్చు, కాని.... కనీసం అతన్ని చూడగలిగింది. మాధవ్ విమానం ఎక్కబోతూ గాంగ్‌వే వైపు చూశాడు. అటుతర్వాత వీడ్కోలుఇవ్వడానికి వచ్చేవాళ్ళు నించున్న ఫ్లోర్ కేసి చూశాడు, అంతదూరంలో నించున్నప్పటికీ మాధవ్ జయని గుర్తుపట్టాడు. చెయిగాలిలోకి విసిరాడు. జయ కన్నీళ్ళు నిండి మసకబారిపోతున్న కళ్ళతోనే గాలిలోకి చేతిని విసిరింది.

చూస్తుండగానే విమానం గాలిలోకి లేచింది.

అప్పటివరకూ తను గమనించలేదు.

తను పూర్తి మేకప్‌లో రావడంచేత తనని చాలామంది వింతగా చూస్తుండడం......... కొంతమంది రకరకాల వ్యాఖ్యానాలు చేయడం వినబడింది.

సిగ్గుపడింది. తలొంచుకుని ఒంటరిగా బిక్కు-బిక్కు-మంటూ విజిటర్స్ హాలులోంచి బయటకొచ్చి ఆటో ఎక్కింది జయ.

ఏడున్నరయింది. థియేటర్ కెళ్ళాలంటే సుమారు ఎనిమిది అవుతుంది.

థియేటర్, ప్రోగ్రాం, కళావతి గుర్తురాగానే వణికి పోయింది జయ.

ఎప్పుడూ లేంది ఈరోజు తనమూలంగా మొత్తం ప్రోగ్రాం అప్‌సెట్ అయిపోయివుంటుంది.

కర్చీఫ్‌తో మొహానికి పట్టిన చెమటని తుడుచుకుంటూ గ్రీన్ రూం వెనకనించి లోపలికి నడిచింది. అక్కడ ఎవరూ లేరు. ప్రోగ్రాం జరుగుతోంది.

తను చేయవలసిన అయిటమ్స్ అన్నీ కల్పన చేస్తోంది. జయనిచూసి ఎవరూ మాట్లాడలేదు, అందరి మొహాల్లో అదో విధమైన సంకోచం, భయం. ఎవర్నన్నా పలకరించాలన్నా భయంగా వుంది జయకి.

"మొదలయి ఎంతసేపయింది?" మెల్లగా అడిగింది ఓ అమ్మాయిని. ఆ అమ్మాయి పేరు మనోరమ. డాన్స్ బృందంలోని కళాకారిణి. మనోరమ బెదురుచూపులు చూసి "చాలాసేపయింది," అంది.

"గొడవ జరిగిందా?"

"ఆఁ ఎందుకు జరగదు. జనం నీడాన్స్‌కావాలని చాలాఅల్లరి చేశారు. అయినా నువ్వెందుకిలాచేశావో ఎవరికీ అర్థంకాలేదు." అంది మనోరమ.

జయ మాట్లాడలేదు.

స్టేజీ కార్నర్‌లోకి నడిచింది జయ. కల్పన కళ్ళు విప్పారినయి. నాట్యంచేస్తూనే కల్పన లోపలికి రావడం, జయ రంగస్థలం పైకి వెళ్ళడం ఒకేసారి జరిగాయి.

జనంలోంచి చప్పట్లు మారుమ్రోగాయి. ఈలలు చెవుల్ని అదరగొట్టాయి.

జయలో ఆవేశం కట్టలుత్రెంచుకొంది. విజృంభించింది. జనతో పోటీపడి ఎవరూ తనని గెలువలేరన్నంత గొప్పగాచేసింది.

నాట్యం ముగిసే సమయంలో జయ స్పృహతప్పి పడిపోయింది రంగస్థలంపైన.

కర్టెన్ పడింది.

ప్రేక్షకుల్లోనూ, కళాకారుల్లోనూ, జయకి ఏమైందోనన్న ఆదుర్దా ఎక్కువైంది.

కార్యక్రమం ముగిసింది.

కాంట్రాక్టు పేపర్ కి జయ తేసుకొంది.

కళావతి చూపుల్లో తనంటే ఏహ్యాభావం కనుపింపగా జయ మనసు తల్లడిల్లిపోయింది.

కల్పనకి పూర్తి ప్రోగ్రాం దొరకడం అదే మొదటిసారి. పలువురి ప్రశంసలు పొందింది. కార్యక్రమం జయప్రదంగా నడిచి నప్పటికీ అనుకున్న ప్రకారం జయ లేకుండా వెళ్ళిపోవటంతో నలుగురు చేసిన విమర్శలు వినలేక జనం పెట్టిన కేకలతో, చేసినగొడవకి తన పరువుపోయినట్టుగా భావించింది. అది అప్రతిష్టగా తీసుకుంది కళావతి.

జయపైన గొంతువరకూ వచ్చిన కోపాన్ని అణచుకొంది.

ఇదివరలో ఎన్ని ప్రదర్శనలు యిచ్చినా యెంతమంది ప్రశంసలు పొందినప్పటికీ సంస్థకి యెంత గొప్ప పేరు తీసుకొచ్చినప్పటికీ ఈ రోజు పెద్దల ముందు జరిగిన మర్యాదల్ని నష్టైట ముంచి నట్టుగానే భావించింది కళావతి.

ఆ రాత్రికూడా జయ భోజనం చేయలేదు. తన కేదో చెడ్డ రోజులు దాపురించాయని జయ ఏడుస్తుంటే కల్పన తన కౌగిరిలోకి చేర్చుకొని ఓదార్చింది జయని.

తెల్లవారితే పరిస్థితులు యెలా విషమిస్తాయో యిద్దరికీ అంతుచిక్కలేదు. కానీ ఏదో జరుగుతుందని మాత్రం యిద్దరికీ తెలుసు. బరువుగా తెల్లవారింది.

కళావతి జయ గదిలోకి వచ్చింది.

"గుడ్‌మార్నింగ్" అంది జయ అణకువగా.

"పాక్ యువర్ లగేజ్ అండ్ సీ గుడ్ బై" అంది కళావతి.

కళావతి ఆ మాట అంటుందని జయ ముందుగానే ఊహించింది. ఏమీ మాట్లాడకుండా దిక్కులు చూస్తు నించుండిపోయింది. కల్పన మెల్లగా జయ దగ్గిరకొచ్చి వీపుపైన నిమురుతూ అంది

"మేడం ఏ పరిస్థితుల్లో జయ యిలా చేసిందో కాస్త ఆలోచించండి. ఒంటరిగా బయటకెళ్ళి ఎక్కడుంటుంది? ఎలా వుంటుంది? ఈసారికి ఎక్స్‌క్యూజ్ చేయండి" అంది.

"ఎవడో బావగాడున్నాడని తిరిగిందిగా ఒంటరిదెందు కవుతుంది?" అంది హేళనగా కళావతి.

ఆ మాటలకి జయకి ఆవేశం ముంచుకొచ్చింది.

"నిజమే మీ రన్నట్టు నిన్నో మొన్నో బయటికి పంపేస్తే అదే నిజమయ్యేది. నన్ను సర్వనాశనం చేశావు. నిజానిజాలు తెలుసుకోకుండా నన్ను నా బ్రతుకునీ అన్యాయం చేశావు" అంది జయ.

కళావతి ఈసడింపుగా అంది,

"కృతజ్ఞతనేది లేనిదానివే నువ్వు. నటరాజుకు అంకితం చేసిన జీవితాన్ని మరొకడికి అర్పించడానికి సిద్ధపడిన దౌర్భాగ్యురాలివి. నువ్వు జీవితంలో పైకి రాలేవు. నీ కిదే నా శాపం, నువ్వు సర్వనాశనం అవుతావు."

"మేడమ్" కల్పన అరిచింది.

ఆ అరుపుకి కళావతి అదిరిపోయింది.

"అకారణంగా నోరుపారేస్తే సహించేది లేదు. ఈ రోజు నుంచి జయకి నేను గార్డియన్ని. మీ కోపతాపాలుగానీ, శాపాలుగానీ దాన్ని ఏమీ చేయలేవు. దాని ఒంటిపైన ఈగవాలకుండా నే కాపాడుకుంటాను."

"అయితే నువ్వూ పో"

"పోతాను. పోక నేనెందుకుంటాను. ఇది నా చెల్లెలు. దానికోసం నేనెక్కడికైనా పోతాను. ఏమైనా అయిపోతాను. రాగద్వేషాలతోకూడిన జీవితాన్ని బండరాయిగా చేసుకొన్న నీకేం తెలుసు బ్రతుకు గురించి" అంది కల్పన.

"నో కామెంట్స్ గెటవుట్" అని గబగబా వెళ్ళిపోయింది కళావతి.

పట్టుదలకి పోయేరేగానీ ఇద్దరూ ఆడపిల్లలు. ఇద్దరూ వయసులో వున్నవాళ్ళు. బయటకెళ్ళి ఎక్కడుండాలి? ఎలా బ్రతకాలి?

"నాగురించి నువ్వెందుకిలా చేశావు. నువ్వు తొందర పడ్డావనిపిస్తోంది. నాకెలా రాసిపుంటే అలా జరుగుతుంది. నన్ను వెళ్ళనియ్. నాకోసం నువ్వు నీ జీవితాన్ని పాడుచేసుకోకే" అంది జయ కల్పనతో.

కల్పన ఉషాషాగా నవ్వేసింది జయ మాటలకి.

"నేను పంపకపోతే నువ్వు వెళ్ళి వుండేదానివి కాదుగా," అంది.

"దానికి పరిహారమిది."

"కాదు నేను నీ గొంతువిన్నరోజునుంచి."

కల్పన దృఢంగా అన్నమాటలతో జయ మనసులో కల్పన స్థానం శిఖరాల స్థాయికి పెరిగిపోయింది.

"ఏమో నాగురించి నీవు కష్టాలు పాలవడం నాకిష్టంలేదు అయినా ఇప్పటికిప్పుడు మనం ఎక్కడికి పోగలం."

"ఏ చెట్టుకిందో వుందాం. ఏ వుం లేదా?" అడిగింది కల్పన.

"నాకోసం ఇంత త్యాగం చేస్తున్నదానివి, నన్ను చెట్టుక్రింద వుంచుతావంటే ఎలా నమ్మను."

"గుడ్, ఆ నమ్మకం వుందిగా. నోరుమూసుకొని బయలుదేరు వెళదాం."

కల్పనవెళ్ళి ఆటో పిలుచుకొచ్చింది. వాళ్ళిద్దరూ గుమ్మం దాటుతుంటే మిగిలిన బృందం కన్నీళ్ళతో వీడ్కోలిచ్చింది. నృత్యకళానికేతన్‌కి పేరుతెచ్చిన కళాకారిణి జయకీ ఆ పరిస్థితి వచ్చినప్పుడు మిగిలిన మాగతి ఏంకానో అన్నభయం అక్కడి వాళ్ళ మొహాల్లోనూ కొట్టొచ్చినట్టుగా కనబడింది.

"ఎక్కడికమ్మా?" అడిగాడు ఆటోడ్రైవరు.

"మేనక" అంది కల్పన.

"అక్కడికెందుకు?" జయ అడిగింది.

"ముందు అక్కడ దిగుదాం. తర్వాత ఏదన్నా గదికోసం వెదుకుదాం." అంది కల్పన.

"సరే, నీ యిష్టం."

హోటలుగదిలో సామాను పడేసి ఓకప్పు కాఫీతాగేక నువ్వు రెస్టుతీసుకో. ఏదోలా ఓ యిల్లు సంపాదించి సాయంత్రానికల్లా వచ్చేస్తాను," అని కల్పన బయటకి వెళ్ళిపోయింది.

గదిలో ఒంటరిగా పడుకుంది జయ.

ఎలాంటి వాళ్ళ కడుపున పుట్టి ఎలాంటి బ్రతుకు బ్రతుకుతోంది తను?

జీవితం అంటే ఇదా? తనకి తెలియకుండానే ఊహించలేని మలుపులు ఎన్నో తిరుగుతోంది. ఇకముందు ఎలా సాగుతుందో అంతుకన్నా తెలీదు.

కల్పన అండదండలు మినహాయించి మరే ఆసరా లేదు. పూర్తిగా భరోసా లేని బ్రతుకైపోతోంది తనది.

మధూ తిరిగి కనబడతాడా?

తను అతన్ని చేసుకోగలదా?

ఎక్కడున్నాడో, ఏంచేస్తున్నాడో?

అందాల భవిష్యత్తు చేతికందినట్టే అంది చేయిజారిపోయింది విధి తనతో ఆటలాడుతోంది. పరిహసిస్తోంది. ఏడిపిస్తోంది. తన చుట్టూ సాలెగూడు వల్లే విషమ పరీక్షలకి గురిచేస్తుంది. అల్లాడిస్తోంది. ఒంపుతోంది. అలాంటి ఊపరీక్షలో ధైర్యంగా నిలబడగలదా తను?

గెలుపా? ఓటమా?

తలపగిలిపోతోంది.

బజరునొక్కింది. రెండునిముషాల తర్వాత బేరర్ వచ్చాడు.

"ఓ కాఫీ తీసుకురా." అంది.

బేరర్ వెళ్ళిపోయాడు.

ఆలోచనలు పట్టి పీడిస్తున్నాయి.

బేరర్ తెచ్చిన కాఫీ త్రాగి తల దువ్వుకోవాలని అద్దం ముందు కెళ్ళింది జయ.

అద్దంలో చూసుకొంది.

అపురూపమయిన సౌందర్యం తనది. తన అందం తనకే మతి పోగొడుతోంది. ప్రముఖ నర్తకిగా పేరుని సంపాదించుకుంది తన అందం కోసం తపించి పోతూ తపస్సు చేస్తున్న వాళ్ళు ఎందరో వున్నారు. అడపాదడపా తనకొచ్చే ఫాన్ లెటర్సే అందుకు సాక్ష్యం.

ఈ ప్రపంచాన్ని జయించి తనచేతుల్లో దారపోస్తానన్నా

యెవరికీ తను మనసివ్వలేదు. అది చేరవలసిన చోటుకెప్పుడో చేరిపోయింది.

పలుచని పెదవులపైన వేసిన ముద్రని యీ జన్మలో తను మరచిపోలేదు.

'తన ప్రాణాలు యీ పెదవుల్లో వున్నాయన్నాడు' బాధగా నవ్వుకుంది. కళ్ళల్లో నీరు సుడులు తిరిగింది. మదట్నుంచీఅంతే! మధూ తనకి అందినట్టే అంది జారిపోతున్నాడు దూరం అవుతున్నాడు.

చిన్నప్పుడూ అంతే!

ఇప్పుడూ అంతే!

స్థిమితంలేని ఆలోచనలు సొరచేపల్లా పట్టి పీకేస్తున్నాయి. ఆ క్టోపస్ తనని మింగేస్తే బాగుండనిపిస్తూంది. కోరలు చాచి డ్రాక్యులా తన గొంతు కొరికేసి రక్తం తాగేస్తే బాగుండని పిస్తోంది.

ఎంతకాలం యిలా? ఎన్నిరోజులిలా?

తనకి సాధ్యమా?

క్షణం ఓ యుగంలా ఎంతకాలం ఇలా గడపగలదు. ఓర్పు నశిస్తోంది। ధైర్యం సన్నగిల్లుతోంది. మనసు కాలిపోతోంది. విరక్తి కలుగుతోంది. మంచంపైనపడి వెక్కి-వెక్కి ఏడ్చిందియ.

కళావతి చేసిందివంతా. ఆ రాక్షసే దీనికంతటికీ కారణం.

అసలు ఉయ్యాలలో అప్పుడే కొట్టుకుపోతే ఎంత బాగుండేది?

'అమ్మా నన్నొదిలి ఎందుకెళ్ళిపోయావు. నన్నీదౌర్భాగ్యపు బ్రతుకు బ్రతకమనా ?' అని గొల్లున ఏడ్చింది.

ఓదార్చేవాళ్ళెవరూ లేరక్కడ.

తనకి తానే సమాధానపడాలి. తనకి తనే ధైర్యం చెప్పుకోవాలి.

ఎడారిలో చిక్కుకున్నమనిషికి ప్రాణాలుపోయే తరుణంలో ఒయాసిస్ కనబడినట్టు కల్పన తనకోసం వచ్చింది. అలాంటి స్నేహితురాలు చాలు. నిజానికి తనకెవరూ లేరన్న విషయాన్ని గుర్తుకు రానీయకుండా ఎప్పుడూ తనకోసం అన్నీ తన నెత్తిన వేసుకుంటుంది కల్పన.

ఇదెక్కడి ఋణమో!

ఏనాటి బంధమో!

కానీ అనిపిస్తుంది కదా, తరచిచూస్తే ప్రతి జీవితానికి ఓ చరిత్ర వుంటు తీసుతుంది. అ చరిత్రవెనక ఎన్నో కథలు, గాధలు, బాధలు వుంటే అవి మాటలుకాదు. చేతివ్రాతలూ కాదు. నుదుటి రాతలే ననిపిస్తుంది. నిజం. ప్రతి వాక్యం ఒక కథకి మూలం. ప్రతి పదమూ ఏదోకథని అంతర్గతంగా చాటిచెబుతూనే వుంటుంది.

కిరాణాషాపుకి వెళితే అక్కడ కొబ్బరికాయపీచు తీసిచ్చే ఏడేళ్ళ కుర్రాడు, దారిలో రోడ్డుపైన కనబడే ప్రతివాళ్ళనీ పైసా కావాలని అడిగే నాలుగేళ్ళపాపనీ అర్ధరాత్రి కారు బాగుచేసే మెకానిక్ పక్కన అతనికి అదీ ఇదీ అందిస్తూ నిద్రమేల్కొనే పసివాళ్ళు.

అసలు ఆపిల్లలెందుకు మేలుకున్నట్టు? పనిలో ఎక్స్పర్టులా అంటే కాదు. ఆపనిని పూర్తిగా చెయ్యనూలేరు. దానికి అనేక కారణాలు. వాళ్ళూ మనుషులే. కాని పూర్తిగా లోకం తెలీని పసితనం. అయినా పైసా సంపాదించి బ్రతకాలనే తపన, ఆరాటం వాళ్ళలో కనబడుతుంది. అదే విచిత్రం మరి.

పైన తిరుగుతోన్న సీలింగ్ఫాన్కేసి చూస్తూ పడుకొంది.

కల్పన యింకా రాలేదు. రెండవుతోంది. ఆకలిగా వుంది. క్రితం రాత్రి భోజనం చేయలేదు.

బేరర్కి చెప్పి భోజనం తెప్పించుకొంది. భోజనంచేసి భవిష్యత్తుగురించి ఆలోచిస్తూ పడుకొంది.

నాలుగ్గంటలకి కల్పన నీరసంగా నిస్సత్తువగా వచ్చింది. పదినిముషాలు మాట్లాడకుండా కుర్చీలో చేరగిలబడిపోయింది.

జయకి ఆమెని పలకరించాలంటే భయంవేసింది. కల్పన చేతులకుండాల్సిన బంగారు గాజులు మాయమైనాయి. వాటిని ఏం చేసి వుంటుందో జయ తేలిగ్గా వూహించుకొంది.

కల్పన కళ్ళుతెరచి చూడకుండానే అడిగింది.

"భోజనం చేశావా?"

"ఆఁ"

"ఇల్లు దొరికింది. సామాజీగుడాలో. అద్దె నూటపాతిక."

"మనం అంత కట్టగలమా!" అనుమానంగా అడిగింది.

కల్పన నవ్వింది.

"కాటోయే కెప్టెన్‌గారి భార్యవు. ఆ మాత్రం కట్టలేవూ?"

"ఏమో! నాకా నమ్మకంపోయింది. ఆ ఆశకూడా లేదిప్పుడు."

"కదిపితేచాలు, తింటావు. దట్సాల్. రేపు వెళ్ళి ఆ ఇంటిలో చేరదాం. కావల్సిన చిన్న చిన్న సామానులు కొని రెండు నెల్ల అడ్వాన్సు ఇచ్చివచ్చాను." అంది.

"నీ గాజులు ఏవి?"

"ఒంటరిగావుండే ఆడపిల్లలదగ్గర బంగారం వుండకూడదే అందుకని ఓ చోట దాశాను."

అంది తేలిగ్గా కల్పన.

జయ నిట్టూర్చింది.

"నాకోసం ఎందుకే నీకింత తపన?"

కల్పన చెంపపైన ముద్దుపెట్టుకుంటూ అడిగింది జయ.

"ఈ అభిమానం కోసమేనే. ఏనాడో చేసుకున్న పాపానికి ఈ జన్మకీ బ్రతుకులో ఎవరూలేనిదాన్నయ్యాను అందుకే నువ్వంటే ప్రాణం పెట్టుకొంది. పొరపాటున ప్రాణంపోతే మట్టిచేసే దిక్కైనా వుండాలిగా"

చేత్తో కల్పన పెదవుల్ని మూసింది జయ.

"అంతమాట ఎందుకే?"

"ఊరికే అన్నాను. చూడు నా కాకలిగా వుంది. ఏమన్నా చెప్పు" అంది కల్పన.

జయ పలానా అని గుర్తుపట్టటం పెద్ద విశేషం కాదు.

జయ హోటల్లో యెందుకు దిగిందీ అక్కడ కొంతమందికి అర్థంకాలేదు.

బేరర్ వచ్చి "మీకోసం యెవరో వచ్చారు" అనిచెప్పాడు.

కల్పనా, జయ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

"రమ్మను" అంది కల్పన.

ముప్పై ఎళ్ళ యువకుడు లోపలికి చాలా హుందాగా వచ్చారు.

"నమస్కారం నా పేరు ప్రసాద్" అన్నాడు.

"నమస్కారం" అన్నారిద్దరూ ఒకేసారి.

"నేను జర్నలిస్టును. చాలా రోజులుగా జయగార్ని ఇంటర్వ్యూ చేయాలనుకుంటున్నాను. కాని అవకాశం పడనేలేదు- ఏక్సిడెంటల్‌గా యిక్కడున్నారని యిప్పుడే విని యిటు వచ్చాను" అన్నాడు ప్రసాదు.

కల్పన అతన్ని పరీక్షగా రెండు క్షణాలు చూసింది.

చూడ్డానికి ఇంప్రెసివ్‌గానూ మంచివాడులానూ కనిపించాడు. కాని జయ ఏదో సాకుచెప్పి అతన్ని పంపించేయా లనుకొంది.

కల్పన వెంటనే అంది జయ అడ్డుపడుతుందని ముందే పసి గట్టి "తప్పకుండా కానీ యిప్పుడు కాదు. మీకు అడ్రసిస్తాను ఓ వారం తర్వాత వస్తే బాగుంటుంది. ఒకవిధంగా మీరడిగినా ప్రస్తు తం ఏమీ చెప్పే పరిస్థితిలో లేము" అంది.

"అలాగే" అన్నాడు ప్రసాదు.

కల్పన అద్దెకి తీసుకున్న ఇంటి అడ్రసు కాగితంపైన రాసిచ్చింది. ప్రసాదు వెళ్ళిపోయాక అంది జయ.

"ఎవరో ముక్కు మొహం తెలీనివాడితో మన కెందుకు చెప్పు. ఇంటర్వ్యూలేసు గింటర్వ్యూలేసు పొమ్మందామనుకున్నాను."

"అందుకే నువ్వాత లివితక్కువదానివంటాను. ఇప్పుడు మనం వంటరివాళ్ళం. ఎవరో ఒకరి ఆసరాకాస్త మనకి అవసరం. అతన్నిచూస్తే ఎందుకో మంచివాడనిపించింది. ముందు ముందు మనకేదన్నా అతను సహాయ పడిపచ్చునుగా" అంది.

కల్పని మాటలకి జయ మాట్లా లేదు.

బొత్తిగా నాలుగ్గోడలమధ్య కూర్చోవాలంటే ఉదయంనుంచీ చాలా బోరుగా వుంది.

జయ సాయంత్రం స్నానంచేసి డ్రస్ చేసుకొని బాల్కనీ లోకి వచ్చినించుంది.

కారిడార్లో కారులు, స్కూటర్లు మొదలైన వాహనాలతో జన సందోహంతోనూ సందడిగా వుంది. పిట్టగోడమీద చేతులుంచి చూస్తోంది,

వరండాలో పక్కగదుల్లో వాళ్ళు తనని చూసే చూపులు ఈటెల్లా తగిలాయి జయకి.

ఆ కళ్ళల్లో ఎర్రజీరలు. వాంఛ- అసహ్యం వేసింది, జయ వాళ్ళున్నగదికి మూడు గదుల అవతల ఒకతను వెకిలిగాచూస్తూ బేరర్‌ని ఏవో అడుగుతున్నాడు.

బేరర్ వెకిలిగా నవ్వుతూ ఏదో చెబుతున్నాడు వాడికి. క్రీగంట చూసింది జయ. ఇంతలో కల్పనకూడా వచ్చి జయ పక్కనే నించుంది.

జయ "ఛీ. ఆవెధవలు చూడు ఎలా చూస్తున్నారో" అంది.

కల్పన నవ్వింది.

"అది లోకవిదితం. మనం ఏమీ చేయలేం. చూసీనట్టు వూరుకోవాలంతే."

బేరర్ పక్కగా వెళ్ళడంచూసి పిలిచింది కల్పన.

"ఏమిటా వెధవ అడుగుతున్నాడు," అడిగింది.

"మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందటండి. ఎవరని అడుగుతున్నాడు" చెప్పాడు.

"ఏం చెప్పావ్?"

"డాన్స్ చేస్తుంటారని చెప్పాను" అన్నాడు.

"ఈసారి ఏమన్నా అడిగితే ఆ పొట్టేలుగాడికి బుర్రని రామకీర్తన పాడిస్తానని చెప్పు" అంది.

"అలాగేనమ్మా" అని వెళ్ళిపోయాడు.

"ఈ ఒక్కరాత్రి గడిస్తే రేపు మనం అంటూ ఏర్పరచుకొనే ప్రపంచంలోకి అడుగు పెట్టచ్చు" అంది కల్పన శాంతంగా.

"చూస్తుంటే మనం చాలా విషమ పరిస్థితుల్లో చిక్కుకుంటున్నామనిపిస్తుంది," జయ ఎటో చూస్తూ అంది.

"అందుకని భయపడుతున్నావా?"

"భయపడి చేయగలిగిందేముంది?"

"ఆమాత్రం ధైర్యం నీలోవుంటే చాలు. సముద్రాన్ని తేలిగ్గా ఈదగలం," అంతలో వాళ్ళు మాట్లాడుకొంటూ వుండగనే చీకటి పడింది.

బేరర్ తలుపు తోసుకొచ్చాడు.

"ఏమిటి?" అడిగింది.

"420 గదిలో ఆయన...."

"ఆ పోలీసులుగాడా!"

"అవునమ్మా. ఆయన పేరు పాపారావు, మిమ్మల్ని రమ్మని చెప్పమన్నాడు. పైసలగురించి బెంగబెట్టుకోవద్దన్నాడు," అన్నాడు.

జయ మొహం ఎఱ్ఱబడింది.

"గెటవుట్ ఈడియట్. ఎవరనుకొంటున్నావ్. మేనేజరుకి చెప్తాను," అరిచింది.

బేరర్ చిరాగ్గా అన్నాడు.

"నామీద ఎందుకమ్మా కోపం. ఆయన చెప్పమన్నమాట చెప్పాను. మీ యిష్టం. మధ్య నాకేమొస్తుంది." అన్నాడు బయటికి వెళ్ళిపోతూ.

"చూసేవా జయా, ఆడదాని బ్రతుకంటే ఈ సొసైటీకి ఎంత తేలికచూసో. ఈ మగజాతి తీరే అంత. పరాయి ఆడదాన్ని గౌరవించటం చేతకాని వాళ్ళెప్పుడూ పైకిరారు," అంది కల్పన.

జయ కన్నీళ్ళు పెట్టుకొంది.

"మనిషిని మనిషిగా ఎందుకర్థంచేసుకోరో తెలీటంలేదు కల్పనా! మనం అసభ్యంగా ఏమీ ప్రవర్తించలేదు. అయినా వాడి కళ్ళకి మనం అనుమానస్పదంగా కనుపించాం. ఎందుకంటావ్? ఇద్దరం ఆడపిల్లలం. హోటల్లో మగదిక్కు లేకుండా దిగాం. ఈ దేశం మారదు. మనుషులు మారరు."

"నువ్వన్నది నిజమే. నువ్వనట్టు ఒక ఆడది రెండో ఆట సినిమాచూసి ఒంటరిగా ఇంటికి రాగలిగిన రోజున ఈదేశంపురోగమించిందని ఒప్పుకోవచ్చు." అంది కల్పన.

బేరర్ పైన మేనేజర్‌కి చెప్పాలనిపించినా అది తమకే అవమానంగా భావించి వూరుకొన్నారు స్నేహితురాళ్ళిద్దరూ.

భోజనంచేసి పడుకొన్నారు.

జయ ఒకవిధంగా ఆలోచిస్తుంటే కల్పన ఆలోచనలు మరో తీరులో వున్నాయి.

జయ మాధవ్ గురించి ఆలోచిస్తుంది కల్పన వర్నాడు ప్రారంభించబోయే కొత్తజీవితాన్ని గురించి భరోసాలేని జీవితాన్ని గురించి ఆలోచిస్తుంది. కానీ మనసుకు ఏదో మారుమూల ఎలాంటి కష్టాలైనా ఎదురీదగలనన్న నమ్మకం ఆమెలో వుంది.

సాధ్యమయినంత త్వరలో మాధవ్‌కి పరిస్థితిని తెలియపరచి జయజీవితాన్ని ఓ ఒడ్డుకు చేర్చాలన్న బలమైన ఆశయం మనసులో నాటుకుపోయింది కల్పనకు.

గదిలో లైటు తీసేయలేదు.

జయకేసి చూసింది. మంచంపైన వెల్లకిలాపడుకొని రెండు చేతుల్నీ గుండెలపైనవేసుకొని నిద్రపోతోంది జయ.

కల్పన గుండె తరుక్కుపోయింది.

జయనిచూసినప్పుడల్లా 'వైకుంఠపాళీ' ఆట గుర్తుకొస్తుంది. ప్రతిసారి పామునోట్లో చిక్కుకొని క్రిందమెట్టుపైకి వొచ్చేస్తోంది.

ఎక్కడుందీ లోపం? అసలెందుకిలా జరుగుతోంది, ఇదేదో గ్రహదోషం అయుండాలి, లేకపోతే ఇంత అన్యాయమా? శాప గ్రస్తురాలిలా చేతో అందుకున్నట్టే అందుకొని అన్నీ మరుక్షణం లోనే పోగొట్టుకొంటున్న దురదృష్టవంతురాలు జయ.

నిద్రరావడంలేదు. కళ్ళు మండుతున్నాయి. లైటుతీసేసి బలవంతంగానైనా నిద్రాదేవిని ఆశ్రయించాలని లేచింది కల్పన. టైం ఒంటిగంటయింది.

మెల్లగా స్విచ్ దగ్గర లైట్ ఆర్పబోయింది. తలుపుపైన మునివేళ్ళతో కొట్టిన చప్పుడయింది. లైటు తీయబోయిందల్లా ఆగిపోయింది కల్పన.

జయ నిద్రపోతోంది. రెండు క్షణాలు ఆలోచించింది. మళ్ళీ తలుపుపైన చప్పుడయింది.

కల్పన పెదవులపైన చిత్రమైన నవ్వొకటి కదిలింది.

ఆ ఒక్క క్షణంలో అనిపించింది.

"ఛీ, ఈ అవబ్రతుకుకంటె అడవిలో చెట్టుగా పుట్టడం నయంకదా," అని.

ఎపడో విడిచిపెట్టి పోయేలాలేదు. బాగా బుద్దిచెప్పాలని నిర్ణయించుకొని వెళ్ళి తలుపుతీసింది.

ఎదురుగా గూడ కట్టులో కట్ బనీనువేసుకొని రూం నెంబరు 120 గాడు ఆ పాపారావుగారు నించున్నారు. మెళ్ళో పలిగోపు గొలుసు లైటు వెలుగుపడి మెరుస్తోంది. కళ్ళు మత్తుగావున్నాయి. బాగా తాగినట్టున్నాడు. వాసన గుప్పునకొడుతోంది.

కల్పననిచూసి వెకిలిగా నవ్వేడు.

"నాకు నిద్రరావడంలా" అన్నాడు పాపారావు.

"అయితే వెళ్ళి మేడమీంచి దూకు" అంది.

ఆ మాటలకి తలతిప్పి చూసి మళ్ళీ నవ్వి,

"వెధవ బెట్టుచెయ్యకు. నువ్వెంతకావాలంటే అంత ఇస్తాను. రా," అన్నాడు గబాల్ని చెయ్యిపట్టుకుని.

కల్పన విదిలించుకొంది. వాడు వదిలిపెట్టలేదు. గదిలోంచి ఒక్కలాగు లాగాడు కల్పనని పట్టుకొని. ఆ వూపుకి వరండాలో కొచ్చిపడింది కల్పన. వరండా నిర్మానుష్యంగావుంది. గట్టిగా అరిస్తే అందరూలేస్తారు. వాడికి ఇదిచెప్పడం మాట అటుంచి ముందు తన పరువుపోతుంది. వాడు కల్పన రెండు భుజాలు పట్టుకొని దగ్గరికి లాక్కోబోయాడు. ఆ అదనులో వాడిమెళ్ళో పులిగోరు చేతికి చిక్కింది కల్పనకి. వాడు పట్టుకోడానికి ప్రయత్నిస్తూనేవున్నాడు. గుండెలపైన చేతులేశాడు, కల్పన పులిగోరు గొలుసుతో వాడి గుండెలపైనా మొహంపైనా గీరేసింది. మొహాన్ని రెండుచేతుల్తో కప్పేసుకున్నాడు పాపారావు. కల్పన విసురుగా గదిలోకొచ్చి తలుపులు వేసేసింది. దీపం వెలుగులో చూసుకొంది, చేతులంతా రక్తం ఆ గొలుసు తనచేతిలోనేవుంది,

"పీడాగ్ని ఇలా నాశనం చెయ్యాలి" అనుకొంది. అంతలోనే ఆ గొలుసునేంచేయాలో తోచలేదు. కల్పనకి తెలుసు. జరిగిందాన్ని వాడెలాగూ బయటికి చెప్పుకోలేడు. ఉదయం మేనేజర్‌కిస్తే సరిపోతుందిలే అనుకొంది. బాత్‌రూంలోకెళ్ళి చేతులు కడుక్కొంది. అలుపు పోలేదు. ఆయాసంతో గుండెలు అదరడం మానలేదు,

జరిగిందంతా గుర్తురాగా శరీరం వణికిపోయింది. అయినా సాహసించి తలుపుతియ్యడం తనది తెలివితక్కువతనమే. గుండెల మీద చేతులేసుకొని పడుకొంది కల్పన. నిద్ర ఎలా పడుతుంది.

* * *

"ఇల్లు బాగానే వుంది" అంది జయ. డాబాపైన గదులు మొత్తం రెండుగదులు. మిగిలినవసతులు బాగానే వున్నాయి, ఆ ఇల్లు రాజభవన రోడ్డులోవుంది. రైలు కట్ట, దాని వెనుకగా హుస్సేన్ సాగర్ అందంగా కనుపిస్తున్నాయి. రెండు సూట్

కేసుల్లోని, ఎయిర్‌బాగ్‌లోని సామానులన్నీ ఇంట్లో సర్దారు.

చీరలో చుట్టిన కాలి మువ్వలు కింపడి ఘల్లుమని శబ్దం చేశాయి, అపురూపంగా వాటికేసి ఓసారిచూసింది జయ. వాటిని చేతుల్లోకి తీసుకొని గుండెల కద్దుకొంది. అసంఖ్యాకమైన అభిమానుల అభిమానానికి తనని పాత్రురాలినిచేసిన మువ్వలు అవి. ఆ మువ్వలు తన ప్రాణం అనుకొంది జయ.

అదే సమయంలో కల్పన సూట్‌కేసులోంచి పులిగోరు గొలుసు బయటపడింది.

అదిచూసి కల్పన గుండెలదిరాయి.

దానిని హోటల్లో మేనేజర్ కిచ్చేయాలనుకుంది. కానీ మర్చిపోయింది. ఇప్పుడేం చెయ్యాలి?

జయ కళ్ళు పెద్దవిచేసి చూసింది.

"ఎక్కడిది?" అడిగింది.

"నన్ను పరాభవించబోయిన ఓ వెధవదగ్గిర పరిహారంగా సంపాదించిన సొత్తు."

"అంటే!"

కల్పన రాత్రి జరిగింది చెప్పింది.

కల్పనచెప్పే మాటలు విని ఆమె ధైర్యసాహసాలని సమయస్ఫూర్తిని మెచ్చుకోకుండా వుండలేకపోయింది.

మొదటసారిగా ఇద్దరూ వంటపనిలోకి దిగారు. కష్టపడి చేసుకోడంలోవున్న తృప్తివల్లకాబోలు ఇద్దరికీ బాగానేవున్నట్టు తోచింది.

రాత్రి ఇద్దరూ ఒకే చాపపైన పడుకున్నారు. ధైర్యసాహసాలతో కళావతి పొమ్మనగానే బయటికి వచ్చేశారు. ముందు జీవితం ఎలాగడవాలి? అన్న ప్రశ్నపైన ఆలోచిస్తున్నారు.

ఇద్దరూ ఒకరికేసి ఒకరు చూసుకొంటున్నారు. ఏదో మాట్లాడాలని కానీ ఏం మాట్లాడాలో తోచని స్థితిలో నిస్సహాయంగా చూసుకొంటూ, గుండెలు నీరసంగా మూలుగుతుంటే ఏం చేయడానికీ తోచక ఇద్దరూ ఒకేసారి గట్టిగా ఊపిరి తీసుకున్నారు.

"భయంగావుందా?" కల్పన అడిగింది.

జయ కళ్ళతోనే నవ్వింది.

"భయమా? దేనికి. భయాన్ని చుట్టుపక్కలకి రానీయకుండా కొండంత ధైర్యాన్నిచ్చే నువ్వ లేవూ?"

అంది జయ.

ఆ మాటలకి కల్పన కళ్ళు తడి అయినయి.

"ఏనాడు రాసిపెట్టివుందో మనకి. ఒక్క తల్లీ తండ్రీ కడుపున పట్టకపోయినా...."

"ప్రేమా, అభిమానం, ఆత్మీయతా అనేది కేవలం రక్త సంబంధంలోనేకాదు. అవి మనిషి మనసునిబట్టి పెరుగుతాయి." అంది జయ.

కల్పన వీపుచుట్టూతా చేయివేసి పడుకొంది.

వాళ్ళిద్దరిదీ తల్లీకూతుళ్ళ సంబంధమా? లేక అక్కచెల్లెళ్ళ ఆత్మీయతా? లేక స్నేహితురాళ్ళ రాగబంధమా? చూసినవాళ్ళు సైతం చెప్పలేని వాళ్ళమధ్య బంధం ఏనాటిది మరి.

బరువుగా కదులుతున్న ప్రతిక్షణాన్ని లెక్కపెట్టుకొంటున్నారు. చీకటి విచ్చిపోయి తెల్లవారితే బాగుండునన్న ఓ ఆశ. తీరా తెల్లారితే ఏంచేయాలో తెలీని దిగులు.

ఏదీ గమ్యం?

ఎక్కడికి? ఎలా? ఎంతకాలం, ఎప్పటికి.

కల్పన దిగులుగా కళ్ళు మూసుకొంది. కల్పన గుండెల్లో మొహాన్ని చేర్చి పడుకొంది జయ.

పదిహేనురోజులు బరువుగా వెళ్ళిపోయాయి. కావల్సినది తెచ్చుకొని వండుకొని తినడం, ఇంట్లో పడుండటం మినహాయించి ఏంచేయాలో తోచలేదిద్దరికీ.

ఉద్యోగం సంపాదించిపెట్టే డిగ్రీలు లేవు.

మరి బ్రతుకుతెరువుకి ఆధారం ఏమిటి?

కేవలం డాన్స్ చేయడంతప్ప మరింకేమీ చేతకాదు. అదీ భారీ ఎత్తున ఏ రవీంద్రభారతిలోనో ఇస్తేతప్ప జనం చూడరు పైగా దాన్ని నిర్వహించేందుకు ఓనాథుడు కావాలి. అదీకాక వాళు హైదరాబాదులో చాలా ప్రోగ్రామ్స్ యిచ్చారు. జనం మాత్రం ఎన్నిసార్లని చూస్తారు! విసుగ్గా వుండదా!

కల్పన దగ్గరున్న చేతిగాజులు, చెవులరింగులు జయమెళో

గొలుసు హరించుకు పోయినయి. చాలాతక్కువ డబ్బొంది చేతి
ఎక్కువరోజులు గడువదు. ఈలోగానే ఏదో ఒకటి చేయాలి.

"అన్నట్టు హలిగోరు గొలుసు వుందికదూ!" అందికల్ప

"అది మనదికాదుగా" అంది జయ.

"కాదని తెలుసు. కానీ దానికోసం వాడురాడుగా. దాం
మనకి ఓనెల గడుస్తుంది కర్లేదు" అంది కల్పన తెచ్చిపెట్టుకొన
ఉత్సాహంతో,

"మనం చిన్న డాన్స్ స్కూలు పెడితే" అంది జయ.

"నిజమే. కానీ పిల్లలు రావాలిగా. నాకు నువ్వు, నీకు నే
తప్ప మరో మూడో మనిషి సహాయం మనకి లేదు" అని న
బాధగా అంది. కల్పన తిరిగి "మన స్నేహాన్ని ఎంతో మం
ఆశించారు. మేడమ్ పడనిచ్చింది కాదు. పేరు డబ్బు మనవ
గడించికూడా మనల్ని అనామకులుగాచేసి అంతా తన గుప్పె
పెట్టుకొంది" అంది.

"ఎవరికెంత రాసిపెడితే అంతే!"

"సిల్లీ!"

"తేలిగ్గా కొట్టేయకు కల్పనా, మనిషి జీవితానికీ, విధికి మ
మనకి తెలీని ప్రమేయం ఏదో వుంటి తీరుతుంది. అదే కాకపో
ఈ నాడు నా బతుకిలా అయ్యేదా? లక్షాధికారి కడుపున పుట్టాక
ఆ లక్షలుచాలక నాన్న దేనికోసమో తపించిపోయాడు. ఉన్న
నేనూ, అమ్మ తృప్తిలేకపోబట్టేగా అకారణంగా హత్యచేయబడ్డా
అలాగే విధి ప్రమేయమే లేకపోతే ప్రకృతి ఆ రోజెందు క
విలయతాండవం చేసింది. అమ్మ ప్రాణాల్నెందుకు బలితీసుకొం
నేనో అనాధగా ఎందుకు విసిరికొట్టబడ్డాను? ఏమయినయి లక్ష
సర్వాన్ని ఉప్పెన తెడిచి పెట్టేసింది"

"అందుకే అంటానుకదా, ప్రతి జీవితం అనుభవాల సమే
శనం కల్పనా, జీవితంలోజరిగే ప్రతి సంఘటనా ఎదురయ్యే ప్ర
సమస్యా ఒక్కొక్క అనుభవం. అంతే, కాదంటావా? ప్రతిక్షణ
అనుక్షణం ఏదో ఒక అనుభవమే." అంది.

కల్పన పకపక నవ్వేసింది.

"పిచ్చిమొద్దూ నువ్వనే జీవితం నాకు మనుషుల్లో కనబ

మనిషికి స్వార్థం ఎక్కువ. అవకాశవాది మనిషి. తన అవకాశం కోసం, ఎదుటి మనిషిని నిలువునా చంపేసే గుణాలున్న మనిషి కంటే మృగాలు నయం అనిపిస్తుంది నాకు.

విచ్చుకొన్న పూలలోనూ, ఆ పూలకిందున్న ముళ్ళలోనూ, ఎవరో బస్‌లోనో, రిక్షాలోనో వెళుతుంటే దానివెనకాలే పరుగెత్తే కుక్కలోనూ, తల్లి తెచ్చే మేతకోసం నోరుతెరచి ఎదురుచూసే పిచ్చిక పిల్లల్లోనూ పిల్లి మేతకోసం తపించే ఆవుదూడల్లోనూ, పచ్చగా కొత్తచిగుళ్ళు వేసే మొక్కల్లోనూ, దాని పక్కనే ఎండిన మోడులోనూ మన తోటలోవుండే గులాబీ మొక్కలోనూ, నడిచే దారికి పక్కగా గుట్టమీదవుండే ముళ్ళచెట్లలోనూ కనిపిస్తుంది నాకు జీవితం.

పదిపిల్లల్ని వెంటేసుకొని తిరిగే పంది, మెడపట్టుకొని ఇంటింటికీ తిప్పే పిల్లి దానిపిల్లలు, దీపంచుట్టు మూగే పురుగులు వాటిలో కథలూ జీవితాలు లేవని అనగలవా!

అన్వయించుకోవాలేగానీ మనంచూసే ప్రతి దారిలోనూ జీవితం కనిపిస్తుంది. నోరూ, మనసువున్న మనిషిగురించి ఆలోచించేది తక్కువైనా పర్లేదు, కానీ నోరూ వాయాలేని స్వార్థంలేని మూగ ప్రాణుల్లో దేనికైనా తెలుసుకోగలగడం. చేతనైనంత సేవచేయడం ఉత్తమం అని నా అభిప్రాయం. అందుకే నాకోసారి అనిపిస్తుంది కదా మనిషిగా ఎందుకు పుట్టానా? అని, ఏ చెట్టు గానో, ఏ ఆవుదూడగానో పుట్టగూడదా! లేదా ఏ గొప్పవాడింట్లోనో గారాలు కురిచే పిల్లగా ఎందుకు పుట్టలేదా అని."

నీకు మరీ మతి పోతోంది" అంది జయ కల్పన మాటలకి.

కల్పన నిరాశగా అంది.

"ఇటువంటి కొన్ని తెగనిసమస్యల్ని వాటిని ఆలోచించడం మానుకొంటేనే మంచిదేమో!"

"నిజమే"

"తల నొప్పిగా వుంది, కాస్త కాఫీ తాగుదామా!"

కల్పన అడిగింది.

జయవెళ్ళి ఫ్లాస్క్ గ్లాసులు తెచ్చి రెండు గ్లాసుల్లో కాఫీని

పోసింది. ఒక గ్లాసుని కల్పనకి అందించి మరొకటి తనుతీసుకొంది జయ.

* * *

జయ ఒక్కతే వుంది యింట్లో. ఇంట్లోకి కావల్సిన సామాన్లు అయిపోయాయి. చేతిలో వున్నడబ్బు కూడా అయిపోయింది తప్పనిసరిగా పులిగోరు గొలుసు అమ్మడానికి కల్పన బజారుకెళ్ళింది.

గదిలో ఒంటరిగా కూర్చుంటె జ్ఞాపకాలు కార్చిచ్చులా గుండెను మండిస్తున్నాయి, ఆ యింట్లో అడుగు పెట్టిం తర్వాత మళ్ళీ కాలు బయట పెట్టలేదు జయ. కల్పనే అన్నీ చూస్తోంది.

సాయంత్రం వెలుగుని మింగేస్తూ చీకటి విరుచుకుపడుతున్న ఆ సమయంలో జయ గదిలోంచి మెల్లగా వచ్చి బాల్కనీలో నించుంది.

చల్లగాలి వంటిని తాకుతోంది. రోడ్డుకేసి, దూరంగా కదులుతోన్న రైలుపట్టాలని ఆ పట్టాల వెనుకగా నల్లగా హుస్సేన్ సాగర్ దీపాలవెలుగులో కనిపిస్తోంది. హుసేన్ సాగర్ వంతెనపైన ఏదో రైలు వెళుతోంది. గాలికి జయ గుండెలపైన, భుజంపైన నిలవలేక పమిటచెరగు జారిపోయి వేసుకొన్న బిల్లని బ్లౌజులోంచి దాని క్రిందున్న బ్రాసరీలోంచి చక్కని వంపునొంపులు నింపుకొన్న జయ గుండెలు ఊపిరితీసి వదులుతూ వుండడంతో బ్లౌజులోంచి బయటకు ఉరకాలని ప్రయత్నంచేస్తున్నాయి. మెళ్ళో వేసుకొన్న పూసలగొలుసు ఆ ఎత్తుపల్లాలపై కొత్త అంచాల సంతరించుకొంటూ సముద్రంపైన కెరటంలా వూగుతోంది.

అంత అందమైన సమయంలోనూ జయ గుండెల్లో నిప్పు వర్షం కురుస్తూనే వుంది. మనసు తుఫాను తాకిడికి గురి అవుతూ వుంది.

తనచుట్టూ ఏవో ఆకారాలు....మసగ్గా భూతాల్లా, దెయ్యాల్లా చుట్టూ మూగుతున్నాయి.

కన్నెపిల్ల కలలుకనే సొగసైన వయసు....నాది అని చెప్పుకోడానికున్న కావాల్సినంత భవిష్యత్తూ, అన్నీ అన్నీ ఇలా చూస్తుండగనే నాశనం కావల్సిందేనా?

గోదావరి నా కన్నీరు

కన్నుమూసినా, తెరచినా, ఆలోచించినా, ఆలోచించకపో
యినా, మనసు ఒకేచోట కేంద్రీకృతమైపోయింది.

అరడుగుల మనిషి, తన ఎదురుగా నించుని చిరునవ్వుతో
నని చేసుకున్న ఓ అనుభూతి. చేతులతో తనని చుట్టేసి బలంగా
ంచెల కదుముకొంటున్నట్టు భ్రమ. తడిఅయిన కళ్ళని తుడుచు
ంటూ లోపలికి నడవబోయింది.

వెనకగా బూట్లచప్పుడయింది.

తలతిప్పి చూసింది జయ.

కళ్ళు విప్పారినయి. ఆశ్చర్యంగా.

"మధూ" అంది జయ.

"నేను ప్రసాద్‌ని", అన్నాడతను.

జయ తేరుకొని అతన్నిచూసింది.

"ప్రసాదా?" ఎవరో గుర్తురాకన్నట్లుగా కొన్ని క్షణాలు
తన్నే చూస్తూవుండిపోయింది.

అతను సన్నగా నవ్వాడు.

"బహుశ మర్చిపోయివుంటారు. నేను హోటల్ మేనకలో
మిమ్మల్ని కలుసుకొన్నాను. పత్రికా విలేఖరిని."

"అవునుకదూ! ఏదో ధ్యాసలో మర్చిపోయాను. క్షమిం
ంచి," అంది జయ తన పొరపాటుని తెలుసుకొని.

"పరవాలేదు" అన్నాడు ప్రసాదు.

"రండి లోపలికి," అంటూ అతన్ని లోపలికి ఆహ్వానిం
ంది.

ప్రసాద్ మెల్లిగా గదిలోకి అడుగుపెట్టి పరీక్షగా ఓసారి
చూశాడు.

అతి సామాన్యంగా ఉన్న ఆ గదిని చూసేక అతనిమనసు
యుక్కుమంది.

అతని మొహంలోని భావాన్ని చాలా తేలిగ్గా చదివిందిజయ
నవ్వలేక నవ్వడానికి ప్రయత్నం చేస్తూ అంది.

"ఈ కళాకారిణి స్థితిగతులని అంచనా వేస్తున్నారా?"

"అదేం కాదు"

"నాకు తెలుసు. కూర్చోమని అనడానికికూడా ఇక్క కనీసం ఓ కుర్చీలేదు, దయచేసి ఆ మోడాపైన కూర్చోండి"

ప్రసాద్ మోడాపైన కూర్చున్నాడు. అతని కెదురుగా చా: పైన తను కూర్చుంది జయ.

"మీ రొక్కరే ఉన్నారు" అడిగాడు.

"మా కల్పన బజారు వెళ్ళింది వచ్చేస్తుంది" అంది.

ప్రసాద్ మెల్లగా అడిగాడు.

"మీరు కళావతి నృత్య కళానికేతన్‌లో వుండేవారు కదా ఇక్కడి కెందుకొచ్చారో అర్థంకావడంలేదు"

"అదో పెద్ద కథ"

"అంటే?"

జయ అతన్ని చూసింది,

"మమ్మల్ని ఎక్స్‌పెల్ చేసింది"

"ఎందుకు?"

"కారణాలు చాలా ఉన్నాయి"

"చెప్పకూడనివా?"

అతని ప్రశ్నతో ఆలోచనలో పడింది జయ.

నిజమే. చెప్పొచ్చుగా. చెప్పకూడదా అన్న సందిగ్ధంలో ప పోయింది. జయ ఏమీ మాట్లాడకుండా చేతివేలితో నేలపైన రాస్తు కూర్చోటంచూసి ప్రసాద్ అన్నాడు.

"ఆల్ రైట్. ఇష్టంలేకపోతే చెప్పకండి."

జయ మాట్లాడలేదు. అంతలో కల్పన వచ్చింది. అతన్ని చూస్తూనే చిరునవ్వుతో విష్‌చేసింది. చేతిలో బ్యాగ్‌ని పక్కనపె జయపక్కనే కూర్చుంది కల్పన,

"థాంక్స్ మీరు వెంటనే గుర్తుపట్టారు" అన్నాడు.

కల్పన అందంగా నవ్వింది.

"ఒక్కసారి నేను ఎవరితోనైనామాట్లాడితే తిరిగి ఆ మని లక్షమందిలోవున్నా గుర్తుపడతాను" అంది కల్పన.

ప్రసాదు జేబులోంచి సిగిరెట్ పెట్టెతీసి "సిగరెట్ కాల్చు కోవచ్చా" అడిగాడు.

"బై ఆల్‌మీన్స్" అంది కల్పన.

అతను సిగరెట్ వెలిగించి పొగని గాలిలోకివదిలి అన్నాడు.

"నేనిక్కడికి రాకముందున్న ఆలోచనలు వచ్చి చూసేక మారిపోయినయి, జయగారు కారణాలు నాకు చెప్పకపోయినా కొంతవరకు వూహించుకోగలను."

అతని మాటలకి కల్పన సీరియస్‌గా మారిపోయింది.

"మేం తెలిసికానీ, తెలీకకానీ పొరపాటు పనేమీ చేయలేదు. కొన్ని కారణాలచేత ఓ ప్రోగ్రాంలో జయ పర్‌ఫారమ్స్ సరైన స్థాయికి అవ లేకపోయింది. అఫ్‌కోర్స్ కార్యక్రమం ప్రకారం అంద జయప్రోగ్రామే. కానీ ఓ దురదృష్ట కారణంచేత అది సాధ్య పడలేదు, అందుకనే బయటకు రావల్సి వచ్చింది."

"మిమ్మల్ని కదిలించి పాతవిషయాలని జ్ఞాపకంచేసి బాధపెడు తున్నానేమో, క్షమించండి."

జయ కాఫీ కలుపుతోంది. కల్పన అదోసారి చూసి అంది.

"హుం....మనసుండీ మనసులేని వాళ్ళలా అనాలుగుగోడల మధ్య, ఓ జైలులులో ఖైదీల్లా బ్రతుకుతూ మా జీవితాలని కళకి అంకితం చేశాం. కానీ మేమూ మనుషులమే. మనిషి అంటేనే అసంఖ్యాకమైన కోరికలపుట్ట. ఒక తిండిపోతుకి మిఠాయి దుకాణం చూస్తే రసగుల్లా తినాలనిపిస్తుంది. మరో దరిద్రుడికి తనతో పోటీ పడి గెలిచి లాక్కొని తింటున్న కుక్కనోట్లో హాట్టెముక్క కావా లనిపించవచ్చు. అదీ కోరికే. ఇదీ కోరికే. కానీ ఆ రెంటికీ మధ్య ఎంతో తేడావుంది. మనిషిగా పుట్టినందుకు, అందునా నా అనేవాళ్ళు లేని ఆడపిల్లలుగా పుట్టి సుఖసంతోషాలని మరోమనిషితో పంచు కొనే అవకాశం లేక కోరికల్ని చంపేసుకొన్నాం. ఒకప్పుడు కాక పోతే మరొకప్పుడైనా 'మనసున మనసై బ్రతుకున బ్రతుకై తోడొకరుంటే చాలని' అనిపిస్తుంది. అది నేరమా?" కల్పన ఆవే శం కట్టలు త్రెంచుకొంది.

ప్రసాద్ ఆమె మాటలకి ఆమెకిగల పరిజ్ఞానానికి చలించి పోయాడు.

"నిజమా. మీమాటలు వింటుంటే అనిపిస్తోంది. నిజంగా మనసుట్టూ కనీసపు కోరికలైనా తీరేవారు ఎందరున్నారూ అని," అన్నాడు.

జయ కాఫీ గ్లాసు అందించింది.

"ఇదో శ్రమ." అన్నాడు.

"మీరే ఈ యింటికొచ్చిన మొదటి గెస్ట్" అంది కల్పన.

"థాంక్స్." కాఫీ తాగి గ్లాసుని పక్కనే పెట్టాడు.

"మీ నాట్య ప్రదర్శనలు చాలాసార్లు చూశాను. రెండు మూడుసార్లు కలుసుకోడానికి ప్రయత్నంచేశాను. కానీ మీ మేడమ్ మాకు అవకాశం ఇవ్వలేదు. ఒక విధంగా నేను మీ అభిమానిని, మీకు ఈ పరిస్థితిలో ఏ విధమైన సేవ చేయగలిగినా ధన్యుణ్ణే." అన్నాడు ప్రసాదు.

"భలేవారే. ఎంత అభిమానమున్నా అంత పెద్ద మాట లెందుకులెండి. కనీసం ఓ సాటి మనిషిగా, కనీసపు విలువల్ని గుర్తించారు. మాకు అదే దివేలు." అంది కల్పన.

ప్రసాదు హుందాగా నవ్వాడు.

"ఒక సాధారణ మనిషి జీవితంకంటే సర్కసుచేసే మనిషి జీవితపు విలువ ఎక్కువకావచ్చు. అతను తనచేష్టలతో జనాన్ని నవ్విస్తాడు. ఆనందపరుస్తాడు. జనం సంతోషంతో చప్పట్లు కొడతారు. దాంతో ఆ మనిషి తన ఒక్క చేష్టతో అందర్నీ నవ్వించగలుగుతాడు లేదా పోతే ప్రాణమే పోతుంది. అంతే అటో ఇటో క్షణంలో నిర్ణయించబడే బ్రతుకు. సర్కసుచూసి ఆనందించలేని మనిషి జీవితంలో మరిదేన్నిచూసి ఆనందపడలేడేమో. ఆ పనిలో ఎంత కష్టం ఇమిడివుంటుందో దానికి అలవాటుపడిన మనిషి మరే యితర కష్టాన్నైనా తేలిగ్గా ఎదుర్కోగలడేమో? మనసుం టుందనుకొనే మనుషులకంటే ఒకోసారి మతిలేని ఆలోచనలేని తాగుబోతులు, పిచ్చివాళ్ళే ఒకవిధంగా మెరుగనిపిస్తుందికదా!" అన్నాడు ప్రసాదు.

జయ పవిట చెరుగుతో విసురుకొంటుంది.

"ఉక్కగా వుంది. అభ్యంతరం లేకపోతే బయట కూర్చుందాము" అన్నాడు ప్రసాదు.

"అలాగే" అంది జయ.

అతను కూర్చున్న మోడాని తనే స్వయంగా బయటికి తెచ్చుకున్నాడు.

"నేను తెస్తానుగా, మీ కెందుకు శ్రమ" అంది కల్పన.

అతని దగ్గరగా చాపపరుస్తూ.

"చెప్పానుగా? నన్ను పరాయివాడుగా మీరు భావించొద్దు. నాకేవో గౌరవమర్యాదలు చేయాలని అనుకోవద్దు. అలాని మీరను కొంటే నన్ను పరాయివాడుగానే భావిస్తున్నారనుకొంటాను."

"అదేం లేదు" అంది పిట్టగోడ నానుకొని చూస్తూ జయ.

"జయగారు ఎక్కువ మాట్లాడరులా వుంది"

అతని మాటలకి కల్పన బాధగా నవ్వింది.

"దాని గురించే నాబాధ. తలుసుకుంటే గుండెబద్దలవుతుంది. పుట్టుకచేత తక్కువది కాదు. గుణంలో లోపంలేదు. నృత్య శాస్త్రంలో అపారమైన కీర్తి ప్రతిష్ఠల్ని సంపాదించుకుంది. ఓ మిలిట్రీ ఆఫీసరికి భార్యకావల్సిన సమయంలోనే దాని దురదృష్టం దాన్ని కాటేసింది."

"అంటే?"

"హు.... ఏమని చెప్పను? ఎలా చెప్పను? జయని ఇంటర్వ్యూ చేస్తానన్నారుగా. చేయండి.

అన్నీ మీకేతెలుస్తాయి. మీకో మహత్తర కావ్యం తయారవుతుంది. అమాయకత్వంలో పసితనంలో కన్నకలలెలా విరిగిపోయిందీ, ఊహ తెలిసీ తెలీనితనంలోనే కన్నవాంని ఎలాపోగొట్టుకొందీ, సిరసంపదలెలా కొట్టుకుపోయిందీ, అనాథ బాలికలా ఓ కళావతి చేతిలో ఎలా పెరిగిందీ, పసితనంలోనే గుండెల్లో పెట్టుకొన్న నేస్తాన్ని ఇంతకాలానికి కలుసుకోగలిగీ ఆశల్ని పెంచుకొని ఏ వినంగా దూరం చేసుకొందీ, కళావతిచేత బయటకి పంపబడి ఈ విషమైనా బరువు జీవితాన్ని సాగిస్తోన్న ఈ అమాయకురాలి గురించి ఎవరికి జాలి? అవసరం లేదు. ఒకరి జాలిగానీ సానుభూతిగానీ దానికి అవసరంలేదు. నేనున్నాను. నాకంఠంలో వూపిరి వున్నంత వరకూ అది నా బాధ్యతే అనుకుంటాను. చెల్లెలనుకొంటాను. నా సర్వస్వం అనుకొంటాను."

కల్పన మాటల వెనకగల వేదన, మనసులోని దావానలం గుండెల్లోని జ్వాలలు, జయ పట్లగల అభిమానమూ....ఎలాంటివో

అర్థంకాగా, ఆమె వ్యక్తిత్వానికి మనసులోనే అంజలి ఘటించాడు ప్రసాదు.

కల్పన కళ్ళు ఎర్రపడ్డాయి. కన్నీరుతిరిగింది. "నేను ఎన్ని పనుల్లోవున్నా, ఏంచేస్తున్నా దాని బ్రతుకెలా అయిందో అన్న బాధ నా మనసుని పొడుస్తూనే వుంటుంది. ఈ గొడవంతా చెప్పి మీకు బోరు కొడుతున్నానేమో," అంది.

"అబ్బే, అదేంలేదు."

కల్పన కళ్ళొత్తుకుంది.

"ఏడుస్తున్నావా?" జయ మెల్లగావచ్చి పక్కనేకూర్చుంది.

"సర్వ సాధారణంగా ఓ కళాకారిణికి మరో కళాకారిణికి పొత్తకుదరదు. నిజానికి జయనిచూసి మీరు ఈర్ష్యపడాలి. అదిలేక పోగా.... అంతలా కలిసిపోయారంటే మీరిద్దరూ మనుషులుకారు. దేవతలని నా అభిప్రాయం."

"ఇలాగే కొన్నిరోజులుగడిస్తే ఇదేమౌతుందోనన్నభయం ఎవర్నిచూసినా మధూ, అనుకొంటుంది ముందు. కాదని తెలిసేక ఏడుస్తుంది. వాస్తవికతని మరచిపోయి, భ్రమలో విహరిస్తుంది. వేదాంతులు అంతా మాయ, మిధ్య అంటారు. కానీ గుండెనుకాల్చే ఈ అగ్నిని మిధ్య అనుకోగలమా? మనసున్న మనిషికి సుఖము లేదంటే, అనేది నిజమేనేమో కదూ! సుఖంగా బ్రతకాలంటే ముందు ఈ సమాజాన్ని వేటాడాలి. మనమూ జంతువులలాగా వాడిగోళ్ళు, కోరల్లో విషమూ సమకూర్చుకోవాలి. ఇది మా అనుభవం నేర్పిన పాఠం. ఈ మాటల వెనకాల దాగిన వేదన అనుభవంతుడికే తెలుసు."

"చాలా ఆలస్యమయింది" అంటూ లేచి నించున్నాడు ప్రసాదు.

"మీ రాక మాకు చాలా సంతోషాన్ని కలిగించింది."

"వస్తుండండి." అంది జయ.

"తప్పకుండా. నాకైతే వెళ్ళాలని లేదు" అన్నాడు.

జయ, కల్పన నవ్వేశారు.

మెట్లు దిగబోతూ అన్నాడు ప్రసాదు.

"నే ననేవాణ్ని వున్నానని మర్చిపోకండి. మీకేం కావల్సినా నే నున్నాను"

"అలాగే"

ప్రసాదు రోడ్డుమీద కొచ్చాడేగాని అతని మనసులో తుఫాను చెలరేగింది.

వీళ్లేం పాపం చేశారని ఈ శిక్ష, దేవుడనే వాడుంటే యిలా జరుగుతుందా? ఇంతకంటే అన్యాయం మరోటి వుందా? వాళ్ళని ఒడ్డుకి చెయ్యాలి అన్న ధృడమయిన సంకల్పం మనసులో బలంగా నాటుకుంది అతనికి.

• • •

"నీకు మాధవ్ అడ్రసు తెలీదు కదూ" అడిగింది కల్పన.

"తెలిస్తే ఉత్తరం రాసేవాళ్ళమేగా" అంది జయ మెల్లగా.

"అతనికి నృత్య కళానికేతన్ అడ్రసు తెలుసుగా"

"తెలుసు"

"అయితే అతనక్కడికి ఉత్తరాలు రాసే అవకాశం వుందిగా"

"అవును. ఆ విషయం నాకు తట్టలేదు కానీ ఎలావస్తాయి మనకి?"

"మనసుంటే మార్గమే లేకపోతుందా, ఆ విషయం నేను చూసుకుంటాను"

"ఎలా?"

"మనోరమ వుందిగా, దానిద్వారా సంపాదిస్తాను"

అంది కల్పన తయారవుతూ.

ప్రతి బుధవారం కళావతి సిటీ కెళుతుంది. అంచేత తను తేలిగ్గా అక్కడికి వెళ్ళగలదు.

కల్పన ప్రయత్నం విఫలం కాలేదు. అనుకొన్నట్టుగానే రెండు ఉత్తరాలు మాధవ్‌నించి వచ్చినయి. మనోరమ తన దగ్గరే జాగ్రత్తగా దాచింది. కల్పన తన చిరునామా ఇచ్చి ఏమన్నా ఉత్తరాలు వస్తే అక్కడికి పంపమని చెప్పింది.

కల్పన ఉత్సాహంగా తిరిగిరావడం చూసిన జయలో తిరిగి చైతన్యం కలిగింది.

“కంగ్రాట్స్” అంది కల్పన.

విప్పాలని మొహంతో ఉత్తరాలని అప్పుడు చూపంగా గుండెలకి హత్తుకొంది జయ.

తర్వాత గబగబా విప్పి చదివింది.

జయా,

నీకోసం గుడి దగ్గర ఎదురుచూసి చూసి వెళ్ళిపోయాను. నువ్వు రాకపోవడానికి ఏదో బలమైన కారణం వుందని వూహించాను. ప్రతిక్షణం నీ జ్ఞాపకాలు నన్ను వెంటాడుతున్నాయి. వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళిపోయాను. కానీ చివరిక్షణాల్లో విమానంఎక్కబోతూ నిన్ను చూశాను. పరిస్థితి అర్థమయింది. మేకప్ వేసుకొని మరీ ఏదో ప్రోగ్రాంకి వచ్చావంటే ఏంజరిగిందీ తెలుసుకున్నాను. కాని నేను దేశరక్షణకి కంకణంకట్టుకొన్న మిలటరీ అధికారిని. అందుకే రాలేకపోయాను.

నీమనసు నాది జయా! అర్థం చేసుకోలేకనీ, కోపం వచ్చి వుంటుందనీ, నువ్వనుకొని వుంటావు. అదేంలేదు. నిన్ను— నిన్నెప్పుడో అర్థం చేసుకొన్నాను. అదీ రోజు కాదు.

అప్పుడు చిన్నతనంలోనే. మనం ఒకొరి కొకరం అనుకొన్నాం. దాన్ని ప్రపంచంలో ఎవరూ కాదనలేరు. ఏ శక్తీ దాన్ని అ లేదు.

జయా ఎలా వున్నావ్? ఏం చేస్తున్నావ్? నీ కోసం రెక్కలు కట్టుకొచ్చి నీ ముందు వాలాలన్న ఆరాటం.... నన్ను పిచ్చివాడ్ని చేస్తోంది.

నీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ —నీ మధు.

ఎంత ప్రేమ? ఎంత అభిమానం? ఈ ప్రపంచంలో ఏ ఆడదాన్ని ఏ మగాడు ఇంతలా ఆరాధించలేదేమో! ఓ ప్రక్క జయకి ఆనందంతో గుండెలుఎగిసిపడుతున్నా మరోప్రక్క దిగులు చోటు చేసుకొంది.

“మళ్ళీ ఎన్నాళ్ళకో........

రెండో ఉత్తరం చింపింది.

జయా,

ఈ రోజువరకూ నీ ఉత్తరం కోసం చూస్తూనే వున్నాను. ఈ రోజు ఉత్తరంలేదూ అంటె రేపు వస్తుందేమో అన్న ఆశతో ఎదురుచూడ్డం.... పైన విమానం వస్తుంటె నీ వుత్తరం వస్తుందేమోనని ఆర్డర్లీని పంపడం.... వాడు ఒట్టి చేతుల్తో తిరిగిరావడంతో నిరాశతో కృంగిపోతూ ఆశాంతితో చచ్చిపోతున్నాను.

నువ్వు ఎందుకిలా చేస్తున్నావో అర్థంకావడంలేదు. అసలేం జరిగింది ?

నిజంగా నీకు నామీద ప్రేమ లేదా అన్న అనుమానం నాకు కలుగుతోంది.

జయా, ఎంత వత్తిడిలోవున్నా, మరెంత పనిలోవున్నా నీ ఉత్తరం రాలేదే అన్న వేదన మనసుని తొలుస్తూనేవుంది.

ఏ క్షణం ఎలాంటిదో తెలీని జీవితాలు మావి. మృత్యువు మమ్మల్ని ఎప్పుడూ వెంటాడుతూనే వుంటుంది. ఇక్కడ మా అనుభవాలగురించి నీకు తెలీదు. వచ్చేవారం ఓ నెలరోజులు ట్రైనింగ్ కి వెళ్తున్నాను. ఆ ట్రైనింగ్ చాలా కష్టం. అడవుల్లోపడి చీకట్లో మైళ్ళకొద్దీ నడవాలి. తినడానికి తిండీ, తాగడానికి నీళ్ళూ దొరకవు. స్నానంవుండదు. కేవలం బిస్కట్లు రస్కులు మినహాయించి ఏమీ దొరకవు. ఇదంతా కష్టంకాదు. బాధ్యత. దేశమాతని రక్షించుకోడానికి, ఆపదసమయాల్లోకూడా గుండెని దిటవుచేసుకోడానికి చేసే ప్రయత్నాలు ఈ బాధని మర్చిపోవడానికి మందుపేసవిలో ఎడారిలో చిక్కుకొన్నవాడికి గుక్కెడు మంచినీళ్ళు ప్రాణాన్నిస్తాయి. ఈ మధూకి నీ చేతినుంచి ఓ ప్రేమలేఖచాలు.

నీ

మధు.

ఉత్తరం చదివేక జయ బావురుమంది.

"ఏమిటే, ఏమయింది ?" కంగారుగా అడిగింది కల్పన. జయ రెండు ఉత్తరాలని అందించింది కల్పనకి. కల్పన ఆ రెండు ఉత్తరాలని గబ గబ చదివింది. జయకేసిచూసి వేదాంతిలా నవ్వింది.

"జయా, ఎందుకే ఏడుపు ? గుండెలు మండుతున్నా పెద

వులపైన చిరునవ్వే వుండాలి. మనసు ముక్కలు చెక్కలు అయి పోతున్నా ధైర్యం చెదిరిపోకూడదు. కలిసిరాని పరిస్థితులపై ఎదురు తిరిగి పోరాడాలి. ఓడిపోగూడదు. గెలవాలి."

"ఏమో నువ్వేన్నన్నా చెప్పు. నాకేమిటో భయంగా వుంది"

"భయంలేదు బెండలూలేదు. ఉత్తరం రాయి. నీ కోసం అతనలా పరితపించిపోతూంటే నువ్వు అతనికి సంతోషం కలిగేలా రాయాల్సింది పోయి యింకా ఏడుస్తూ కూర్చుంటే ఎలా? ఇన్ని రోజులూ అడ్రసూ అదీ తెలీదనుకో. ఇప్పుడైనా అన్నిసంగతులూ అతనికి రాయి" అంది.

జయ ఆ సాయంత్రం మధూకి వివరంగా అంతా తెలియ పరుస్తూ ఉత్తరం రాసింది. విషయాలు తెలిసేక మధు బాధపడతా డన్న భయం గుండెల్లో మూరుమూల లేకపోలేదు జయకి.

—కల్పన అలసటగా వచ్చింది బయటనుంచి.

"ఎక్కడికి కెళ్ళావ్?" అడిగింది జయ.

కల్పన నీరసంగా నవ్వింది.

"ఉద్యోగం కోసం"

కల్పన మాటలకి జయ పెదవులపైన ఆశ్రయించుకున్న నవ్వు మాయమైంది.

"మనకి ఉద్యోగం ఎవరిస్తారు?"

"మనకి తగ్గ ఉద్యోగమే. నిన్ను మధుకి ఒప్పగించిన తర్వాతైనా నేను నా కాళ్ళపైన బతకాలిగా జయా."

"అంటే నన్ను వదిలి వెళ్ళి పోతావా?"

"బిడ్డనొదిలి తల్లి ఎక్కడికి కెళుతుంది?"

"మరి ఆ మాటలేమిటి?"

"ఏదో యధాలాపంగా అన్న మాటల్నెందుకు పట్టించు కుంటావ్ చెప్పు."

"యథాలాపంగా అన్న మాటలు కావవి. మనసులోవున్న మాటే. నేనూ ఉద్యోగం చేస్తాను!"

"ముందు ఒకళ్ళకి దొరికితే తర్వాత రెండోవాళ్ళ సంగతి ఆలోచిద్దాం. చేతిలో డబ్బు అయిపోవస్తోంది."

"వాళ్లోగానే ప్రయత్నం చేయాలి."
"ఏదన్నా ప్రోగ్రాం యిస్తే."
"ఏర్పాటుచేసే వాళ్ళుంటేగదా."
"ప్రసాదుగార్ని అడిగి చూద్దాం."

ఆ మాటలు అంటుండగానే అతనువచ్చాడు. పత్రికా విలేఖరి కనుక కొన్ని ఎసోసియేషన్స్‌తో పరిచయం అతనికి వుంటుంది. ఏలాగో అతను తెలుసుకుంటే ప్రదర్శనకి ఏర్పాటు చేయగలడనే నమ్మకం జయకివుంది. అందులోనూ తను ప్రోగ్రాం యివ్వడానికి రెడీగా వున్నానంటే ఎవరైనా సహకరిస్తారన్న నమ్మకంవుంది జయకి.

ప్రసాద్‌కికూడా అది నచ్చింది. తప్పకుండా చేస్తానన్నాడు. మాకు గవర్నమెంటు ఉద్యోగాలు రావు. కారణం ఏ డిగ్రీలులేవు. ఏదో మాకు తెలిసిన ఈ విద్యని ప్రదర్శించగలమేకానీ...." అంది కల్పన.

ప్రసాద్ నవ్వాడు.

"మిమ్మల్ని మీరు కించపరచుకోవద్దు దయచేసి. మీలోని కళాకౌశలానికి టెలివిజన్‌లో ఉద్యోగం రాకూడదా?" అన్నాడు.

"నిజమే. కానీ అందుకు ఎవరైనా పూనుకోగలగాలిగా," అంది జయ.

"నేను ప్రయత్నం చేస్తాను" అన్నాడు ప్రసాదు.

"థాంక్స్" అంది కల్పన.

ప్రసాద్ వెళ్ళిపోయాక జయ అంది.

"నిజమే నువ్వన్నట్టు చాలా మంచివాడులా వున్నాడు."

కల్పన నవ్వింది.

"ఓ మనిషి తత్వాన్ని చదవడానికి కొన్నిరోజులూ, సంవత్సరాలు అవసరం లేదే. కంటిచూపు మాత్రంలో అవతలివాడు ఎలాంటివాడు అన్నది పసికడతాను" అంది.

అయితే అనుకున్నట్లు ప్రసాద్ జయ నాట్యప్రదర్శన ఏర్పాటు చేయలేకపోయాడు.

జయకి పొగరని, పెద్దపెద్ద డిగ్రీలున్న వస్తేనే తిరస్కరించిందనీ, కళావతి జయని దూషించిందని తెలిసి ఎవరూ నమ్మకంగా ఒప్పుకోలేకపోయారు. కళావతి జయగురించి చేస్తున్న ప్రచారాలే అందుకు కారణం అని అతను తెలుసుకున్నాడు. కొందరైతే ప్రసాద్‌కి అవి నైనగల కంప్లైంట్సకి కారణం ఏమిటన్నారు. అతనికేం చేయడానికీ తోచలేదు. పదిహేను రోజులపాటు మొహం చాటేశాడు ప్రసాద్. ప్రసాద్ వస్తాడని రోజు ఎదురుచూసి చూసి అతను రాక పోవడంతో నిరుత్సాహపడ్డారు. జయ మధూకి ఉత్తరం రాసిన్నా పదిహేను రోజులయింది. అతనినించి కూడా సమాధానం లేదు. ముందు అతనెందుకు రాయలేదని విచారించినా, తర్వాత అతను రాసిన ఉత్తరాలని పదే పదే చదివేక బహుశా ట్రైనింగ్‌లో వుండి వుంటాడని సర్దిచెప్పుకున్నారు.

ఉన్న నగ నీన్ని హరించుకుపోయినయి. చేతిలో డబ్బులేదు. ఎవర్నన్నా అభిమానం అడ్డొచ్చింది.

కల్పన సాయంత్రం అనగా బయటికి వెళ్ళింది. రాత్రి పది కొండు అవుతోంది. తిరిగి రాలేదు. జయకి గుండెల్లో భయం. చెప్పకుండా వెళ్ళింది. ఎక్కడికి వెళ్ళిందో? అంత ఆలస్యం ఎందుకు జరిగింది? ఒంటరిగా ఎలా వస్తుంది?

జయని వళ్ళీ ఆలోచనలు ఒక్కసారిగా విస్పష్టంగా ముంచేసినయి.

మధూ దగ్గర్నించి జాబు లేదు.
ప్రసాద్ కనిపించడం మానేశాడు.
కల్పన చూస్తే ఇలా తిరుగు.
అంతా అయోమయంగా వుంది.
చాపమీద పడుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

"భగవాన్ నన్నెందుకు లా ఏడిపిస్తున్నావ్? నేనేం పాపం చేసానని. నన్నిలా చిత్రహింసలు పెడుతున్నావ్. నన్నొక్కసారి చంపేయ్." అని విలవిల్లాడి పోయింది.

అరగంట గడిచింది.

ఏదీ కల్పన?

మనసు పరిపరివిధాల పోతుంది. ఒక ఆడది, అందునా వయసులో వున్నది. ఉద్యోగం సద్యోగం లేనిది, బయట ప్రపంచంతో ఏ విధమైన లావాదేవీలు లేనిది, అలాటి మనిషి ఎక్కడికెళ్ళినట్లు? ఏం చేస్తున్నట్లు?

సురక్షితంగా వస్తుందా? కొంపదీసి కల్పన కేమైనా జరిగిందా? కల్పన తనకి మిగిలిన ఒక్క ఒక్క దిక్కు.

కన్నీళ్ళు తుడుచుకున్నది జయ.

లేచి కూర్చుని మోకాళ్ళపైన తలపెట్టుకొని తనని చంపుతున్న ఆలోచనలకి సమాధికట్టడానికి సర్వ ప్రయత్నాలు చేస్తోంది.

మరో అరగంట గడిచింది.

జయ గదిలోంచి బాల్కనీలోకొచ్చింది. బయటింకా చీకటి.

గుండె గుభేలుమంది. కటిక చీకటిగావుంది. ఆ రోడ్డులో అంత చీకటిలో కల్పన ఎలావస్తుంది?

గదిలో లైటు తీసేసి వచ్చి పిట్టగోడపైన కూర్చుంది జయ.

"ప్రసాద్ ఒట్టి కబుర్లుచెప్పే మనిషేనా?" అనిపించింది. ఒకనాడు రంగస్థలంపైన తన కాలిగజ్జెలు ఘల్లుమంటే ప్రేక్షకుల గుండెలు ఝల్లుమనేవి!

ఆ ఆదరణ ఏమైంది?

ఆ అభిమానం ఏమైంది?

ఆ కరతాళధ్వనులు ఏమైనాయి. ఆ ప్రశంసలన్నీ ఎక్కడికి కొట్టుకొని పోయినట్టు?

కళావతి తనని హెచ్చరించిన కొన్ని మాటలు గుర్తుకొచ్చినయి జయకి. ఆ మాటలు నిజమే అనిపించాయి. జయ గదిలోకి నడిచింది. లైటువేసి చేతి అద్దంలో చూసుకొంది.

ఏవిధమైన అలంకారాలు లేవు. అయినా తను అందంగానే వుంది. ఇప్పుడొస్తున్న ఏ సినీ నాయికా అందచందాలతో తను తీసిపోదు.

జయ పెదవులపైన అదోరకమైన చిరునవ్వు కొన్ని క్షణాల పాటు వెలిగి మాయమైంది.

తనకి సినీ నాయికి కావాలన్న కోరికలేదు.

వేలూ. లక్షలూ సంపాదించాలనీ కోరుకోలేదు.

మధూతో జీవితాన్ని పంచుకొని ఓ గృహిణిగా జీవించాలనుకొంది. అది సామాన్యమైన అడదానికి వుండే అతిసామాన్యమైన కోరిక.

అందుబాటులో వుండి అందకోలేకపోతున్న తనది దురదృష్టమా, లేక కర్మఫలమా!

ఇంటిముందు ఆటో ఆగిన శబ్దం అయింది. బాల్కనీలో కెళ్ళింది. కల్పన ఆటోలోంచి దిగింది.

జయ జాగ్రత్తగా గమనించింది.

ఎక్కడో ప్రోగ్రాం యిచ్చినట్టుగా తుడిచేసిన మేకప్ గుర్తులు చెబుతున్నాయి.

"ఒంటరిగా భయపడ్డావా?" అడిగింది కల్పన నవ్వుతూ.

"లేదు, చచ్చిపోవాలనుకున్నాను."

"ఏమిటా మాటలు?"

"లేకపోతే ఏమిటీది? ఇప్పటివరకూ నువ్వు రాకపోతే ఏమనుకోవాలి."

"కల్పన బరువుగా నవ్వింది. అలసటగా చాపపైన వాలిపోయింది."

"అడిగిందానికి సమాధానం చెప్పలేదు."

"నాకు ఉద్యోగం దొరికింది" అంది కల్పన.

జయ నోరెళ్ళబెట్టి చూసింది.

"నీకు ఉద్యోగం వచ్చిందా, ఏమిటది?"

జయ మాటలకి సమాధానంగా కల్పన లేచి కూర్చుంది.

"అవును, ఫోర్ ఏసెస్‌లో కేబరేగా చేరాను." అంది కల్పన హుషారుగా.

"కేబరేనా?" ఆశ్చర్యంగా అడిగింది జయ.

"అవును, ఏం?"

"నువ్విలా తెగిస్తావనుకోలేదు."

"ఇది తెగింపు కాదు. బ్రతుకు తెరువు"

"అలాగని అసహ్యకరంగా నలుగురిలో సిగ్గూ ఎగ్గూ వదిలేసి, నీ శరీరాన్ని నలుగురూ తినేసేలా చూస్తుంటే ఆ చూపుల్ని భరిస్తూ సహిస్తూ ఎలా చేస్తావే! నీకు సిగ్గేయడం లేదూ!"

"నిజమే కాదనను. కానీ మనం బ్రతకాలి. నీచమైన చావు చావకూడదు. అయినా నేను తప్పేం చేయటంలేదుగా. ఇది కూడా ఒక కళే. కళని ప్రదర్శించడం కళాకారిణిగా నా బాధ్యత కూడా. అది కూడా కేవలం పొట్ట కోసం. ఏ విద్య అయినా పొట్టకోసమేగా జయా."

"ఏ సరదా సుఖాలనీ నాకోసం ఎందుకు వొదులుకున్నావో నాకు తెలీటం లేదు కల్పనా. నేను పాపిని. ఈ పాపికి ఏదన్నా సహాయం చేయాలనుకొంటే ఆ పాపం ఆ మనిషికి కూడా తగులుతుంది."

"బాధపడకు. రాసిపెట్టిందాన్ని ఏ దేవుడూ తప్పించలేడు."

"వేదాంతం చెప్పకు"

"ఇది వేదాంతమా మనుషులందరూ విధిని నమ్మకపోవచ్చు. ఆస్తికుడు దేనికైనా ఆ దైవంపైన భారంవేసి నిశ్చింతగా వుంటాడు. నాస్తికుడు అన్నింటికీ తనే కారణమని విర్రవీగుతాడు. లేదా కృంగిపోతాడు. ప్రత్యేకించి విధిని నమ్మకపోయినా ప్రతి చర్యా ఫలితాల భారం, ఏదో ఒక అదృశ్యశక్తి మీద మోపితే మనసుకు నిశ్చింత కలగటం తథ్యం. ఆ అదృశ్యశక్తే నమ్మినవాడికి దైవం నమ్మనివాడికి మరోటి."

"సర్లే ఆపు, అయితే రేపట్నుంచీ నేనుకూడ నీతో వస్తాను."

"తొందరపడకు మధూకి తెలిస్తే బాధపడతాడు."

జయ మాట్లాడలేదు.

అయినా నీకు తెలుసుగా. నాకు పెన్సరిన్ పైపు డాన్స్ ఇష్టం అని. చూడు మనసులో ప్రతిఒన్న విషయాన్నీ పెట్టుకొని భూత అద్దాల్లో చూసి బెంగపడొద్దు. ప్లీజ్ చూడవే నాకసలే ఆకలేస్తోంది. ఏమన్నా చేశావా?" అడిగింది.

"ఆ."

"నువ్వు భోజనం చేశావా?"

"లేదు."

"నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నావన్న మాట. పిచ్చి పిల్ల."

జయ సమాధానం చెప్పకుండా గిన్నెలు తేవడానికి లోపలికి వెళ్ళింది.

"పిచ్చి మొద్దు. నేనంటే ఎంత ప్రేమ నీకు." అంది కల్పన.

జయ కన్నీళ్ళతో చూసింది.

"ఈ బ్రతుకు నీకన్యాలతో చాలని సరిపెట్టుకొని. చచ్చిపోవాలనీ, తిరిగి నీకడుపున పుట్టాలనీ అనిపిస్తోంది నాకు," అంది జయ.

నిజానికి ఇద్దరికీ ఆకలిగావుంది. కానీ అంతులేని అభిమానం వెల్లువలా పొంగి ప్రవహించగా వేరే భోజనం అవసరం లేక పోయింది ఇద్దరికీ.

ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకొని పడుకున్నారు.

"రోజూ ఇలాగే ఆలస్యం అవుతుందా?"

దిగులుగా అడిగింది జయ.

"తప్పదుగా."

"నాకు భయంగా వుంటుంది."

"ఎందుకు?"

"ఏమో, ఎలా చెప్పాలో తెలీటంలేదు." అంది జయ.

"ఏ బూచీ మనని ఎత్తుకు వెళ్ళదు. ధైర్యంగా వుండు," అంది కల్పన నవ్వుతాలకి. జయ ఫక్కుమని నవ్వింది.

* * *

మరో వారం రోజులు గడిచాయి.

మధు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది జయకి. జయ వూహించినట్టు అతను ట్రైనింగ్‌లో నేవున్నాడు. త్వరలో వాళ్ళమ్మ గారు వచ్చి తనని తీసుకెళతారని రాశాడు. జరిగిన విషయాలకి తన బాధని తెలియచేస్తు రాశాడు.

వెయ్యిరూపాయలకి డ్రాఫ్ట్ పంపాడు. అతను డ్రాఫ్ట్ పంపా డన్న ఆనందం కాదు జయకి. అతను రాసిన వుత్తరం చిన్నదే అయినా ప్రతిమాటా అతను తన ఎదురుగా నిలబడి మాట్లాడు తున్నట్టు అనిపించింది. చదివిన ఉత్తరాన్నే ఒకటికి పదిసార్లు చదువుకొంది. మధుకి తనంటె "పిచ్చి ప్రేమ" అనుకొంది జయ.

ఇంతలో ప్రసాదు వచ్చాడు.

"పేపర్లో మీ ఫోటో వేయించాలనుకొంటున్నాను."

ప్రసాద్ కూర్చుంటూ "ఎందుకు" అన్నాడు.

"ఫలాన అబ్బాయి తప్పిపోయాడు, అచూకి తెలియచేస్తే చిన్న పారితోషికం ఇచ్చేస్తాను" అంది.

నేను వచ్చానుగా, ఆ ఇచ్చేదేదో నాకే ఇవ్వండి" అన్నాడు.

అతని మాటలకి జయ నవ్వేసింది.

"చెప్పండి ఏమిటి మొహం చాటేశారు."

"అబ్బే అదేం లేదు. కాస్త చిరాకుగా వున్నాను" అన్నాడు.

"అవును, కబుర్లు మాత్రం బడాయిగా చెప్పి వెళ్ళిపోయారు. అయినా మేం ఎవరమని మీకు శ్రద్ధ వుంటుంది లెండి."

జయ అంత ఫ్రీగా ఈజీగా మాట్లాడుతుందని ప్రసాద్ వూహించుకోలేదు. చాలా ఫ్రీగా మాట్లాడుతోంది.

"మీరు నిష్ఠూరం చేస్తున్నా అలా మొహమాటం లేకుండా మాట్లాడుతున్నందుకు చాలా ఆనందంగా వుంది" అన్నాడు.

"కాఫీ తాగుతారా! లైమ్ జ్యూసా!

"ఏదీ వద్దు."

"అతిథిమర్యాద తెలీని వాళ్ళం అనడానికే మళ్ళీ"

"అయితే కాఫీ ఇవ్వండి."

జయ ఫ్లాస్కులో కాఫీని రెండు గ్లాసుల్లోపోసి తీసుకొచ్చింది.

"రెడీగానే వుందన్న మాట."

"ఈమధ్య కాఫీకి బాగా అలవాటు పడ్డాను. అందుకే కలిపి ఫ్లాస్కులో అట్టిపెడుతున్నాను."

"కల్పన ఏదీ?"

జయకి ఏం చెప్పాలో తెలీలేదు. కల్పనకి తెలీకుండా వివరాలు చెప్పడం ఇష్టంలేక "బయటికి వెళ్ళింది" అంది.

"ప్రోగాం విషయం ఏం చేశారు?" అడిగింది.

ప్రసాద్ ఆ విషయంలో ముందే నిర్ణయించుకొని వచ్చాడు.

"యింకా ఏమీ కాలేదు. అసలు ప్రయత్నం చెయ్యలేదు" అన్నాడు.

జయ నిరుత్సాహంగా అంది.

"మీరు కనబడ్డం మానేస్తే అనుకున్నాను కదా ఈ మనిషి ప్రోగ్రాం ఏర్పాటుచేసి కానీ రాడు అని."

"నేనూ అలానే అనుకున్నాను. కానీ చెప్పానుగా, ఇతరత్రా చాలా పనుల్లోవున్నాను. అలాని నేను మీ విషయం మర్చిపోలేదు. టి. వి, లో ఓ ప్రోగ్రాంకి కాంట్రాక్టు ఇచ్చారు. ఈ ఫారంపైన సంతకం చేయండి," అన్నాడు.

జయ కాంట్రాక్టు ఫారంపైన సంతకంచేసి ఇచ్చింది.

"ఈ నెలాఖరులోగా వస్తుంది ప్రోగ్రాం," అన్నాడు.

"థాంక్స్."

కల్పన వస్తుందని తొమ్మిదివరకు చూసి వెళ్ళిపోయాడు ప్రసాదు.

కల్పన లేకుండా ఇంట్లో ఒంటరిగా గడపడం, ఎదురు చూడ్డం జయకి ఇప్పుడిప్పుడే అలవాటు అవుతోంది. అలాంటి సమయంలో జయ మనసులో నిండిపోయేది మధూని గురించిన ఆలోచనలు. ఆ ఆలోచనల్లో సమయాన్ని మర్చిపోయి కలల్లో తేలిపో

తుంది. అంతలోనే వాస్తవంలోకి వచ్చి మళ్ళీ దిగులు పడుతుంది. కన్నీళ్ళు పెట్టుకొంది. ఏడుస్తుంది. ఇది జయకి అలవాటైపోయింది.

* * *

చుట్టూ చీకటిగావుంది. కన్నుపొడుచుకున్నా ఏమీ కనిపించని చీకటిగావుంది. రోడ్డుకాదది. అడవి. అన్నీ ఎత్తైన్లాలు! రాళ్ళు రప్పలు, చెట్లు పుట్టలు, గుండెలు గుబేలుమనిపించే చీకటి నృత్యం చేస్తోంది.

అలాంటి ప్రదేశంలో ఆ చీకటిలో చీకటిని దూసుకొంటూ నడుస్తున్నారు, ఆరుగురు ఆఫీసర్లు. ప్రతివాడి భుజానికివున్న కిట్ బాగ్ నాలుగు కేజీలకి తక్కువ బరువులేదు. మరో భుజానికి గన్ వేలాడుతోంది. రోజుకి కొన్ని కిలోమీటర్లు నడవాలి. కొంతమంది దమ్ము పట్టలేక ఆయాసపడుతున్నారు. నీరసంగా నడుస్తున్నారు. కానీ మాధవ్ నడకలో వేగం తగ్గలేదు. శరీరంపైనవున్న శ్రమనీ తెలీనివ్వడంలేదు.

అతని మనసులోవున్న జయ అతనికి వూపిరిపోస్తోంది.
అతనిలోని ఉత్సాహం జయ.
అతనిలోని చైతన్యం జయ.

జయని గురించిన ఆలోచనలే అతన్ని ఉత్తేజపరుస్తున్నాయి జయ కళ్ళెదుట పంచాలేగాని మాధవ్‌కి ఈ ప్రపంచాన్ని జయించడం పెద్ద లెక్కలోదికాదు. నడుస్తూనే చేతి గడియారంలోకి చూశాడు. రాత్రి పన్నెండయింది.

ఒకాఫీసరు కిందపడిపోయాడు. మాధవ్ తలతిప్పి చూశాడు.

"మిస్టర్ వర్మా, వాట్ హేపెంన్?" అరిచాడు మాధవ్. వర్మ ఎవరి ఆసరా లేకుండానే నించున్నాడు. ఈలోగా వెనకగా వస్తున్న ఆఫీసర్సుకూడ వచ్చి వాళ్ళిద్దర్నీ చేరారు.

"అడుగు రాయిపైన పడి స్లిప్ అయింది అన్నాడు వర్మ.

అడుగు ముందుకు తీయబోయి విస్మయంగా చూస్తూ ఆగిపోయారు అందరూకూడా.

ఎదురుగా పదిగజాలదూరంలో చింతనిప్పుల్లా రెండుదీపాలు వెలుగుతున్నాయి.

"టైగర్" అన్నాడు మెల్లగా మాధవ్.

"షూట్" వర్మ అన్నాడు.

"నో. డోంట్ షూట్" అన్నాడు మాధవ్.

"అది మనని గమనించింది. దానికి అడ్డుగా నిలబడింది. వీలుచూసి ఎవర్నో దెబ్బతీస్తుంది" అన్నాడు వర్మ.

"కాసేపు చూద్దాం మెల్లగా వెనక్కి జరగండి."

మాధవ్ ఆదేశానుసారం అందరూ పక్కగావున్న చెట్టు పక్కగా నడిచారు. పులి ఎప్పుడు విరుచుకుపడితే అప్పుడే కాల్చి వేయటానికి అందరూ రెడీగా తుపాకులు గురిపెట్టారు.

కాలి క్రింద ఏదో జరజర పాకింది. మాధవ్ కళ్ళు టార్చి లైటులా పనిచేశాయి. పెద్ద నాచుపాము. కాళ్ళ ముందు పడగవిప్పి కూర్చుంది. చేతిలో తుపాకిని వెనక్కితిప్పి దాని తల ఎగిరి అవతల పడేట్టు కొట్టాడు. ఆదెబ్బకు అదెగిరి ఎక్కడో పడిపోయింది.

అందరిచూపు పులిపైనే వుంది. పులి అక్కడ్నుంచి కదిలింది పొదల్లోకి వెళుతోంది. నమ్మి ముందుకెళితే అది వెనకనించి ఎటాక్ చేస్తుందన్న అనుమానం లేకపోలేదు మాధవ్‌కి.

"ఈ రాత్రికి మనం ఈ చెట్టుపైన కూర్చుందాం. తిరిగి ఉదయం బయలుదేరుదాం" అన్నాడు ఓ ఆఫీసర్. మిగిలినవాళ్ళకి ఆ ప్రతిపాదన నచ్చింది. కానీ మాధవ్ ఏమంటాడోనని ఎదురు చూశారు.

"భయమా!"

"నో సర్"

"చట్నాల్ రైట్. టేక్ రెస్ట్" అన్నాడు. ఆ చెట్టుచుట్టూ తిరిగి చూశాడు మాధవ. కిట్ బాగ్‌లోంచి టార్చితీసి ఆ చెట్టుపైకి వేసిచూశాడు.

ఒత్తైన కొమ్మలతో ఆకులతో గుబురుగావుంది ఆ చెట్టు. ఒక్కొక్కళ్ళే చెట్టు ఎక్కారు.

మాధవ్ పీలుగా చేసుకొని ఓ కొమ్మపైన పడుకొన్నాడు. అతనికిలాంటి పరిస్థితులు కొత్తవికాదు. సాహసంతో కూడిన ఏ పని నైనా అతను ఉత్సాహంతో చేస్తాడు. అందుకే పై అధికారులు అతన్ని బాగా లైక్ చేస్తారు. అలాంటి సమయంలో కూడా మాధవ్‌లో వున్నది జయనిగురించిన ఆలోచనలే. ఎవరూ తోడు లేకుండా జయ పడే అవస్థ గుర్తుకొచ్చేసరికి నీరసంగా అతని గుండె మూలిగింది, నిజంగా కల్పన దేవత. తనులేని లోటుని తీర్చి జయని ఆదుకొంది అవిడ ఋణాన్ని జీవితంలో తను తీర్చుకోలేడు.

జయ ఎలావుందో? ఆమె జాబు రాసినా ప్రస్తుతం తనకి అందదు. హెడ్ క్వార్టర్స్‌కి వెళితేకాని జయ సంగతులు తనకి తెలీవు.

తనున్న ప్రస్తుత పరిస్థితిని ఊహా మాత్రంగా వూహించ గలిగినా జయ తట్టుకోలేదు.

నవ్వొచ్చిందతనికి.

జయ పిరికిది. ఏడుస్తుంది. ముందు ఉద్యోగం మానేయ మంటుంది. తన ఎదురుగా వుంటే చాలంటుంది. ఏదోలా బ్రతక లేమా? అంటుంది.

"జయా, నువ్వు నా వూపిరివి, ప్రాణానివి."

మనసులోనే అనుకొన్నాడు.

సిగరెట్ వెలిగించి ఆలోచనలోపడ్డాడు. తల్లికి అన్ని విష యాలు వివరంగా తెలియచేశాడు మాధవ్.

మాధవకి తెలుసు తన తల్లికి జయంటే పంచప్రాణాలని." "అమ్మ జయని తీసుకెళితే ఏ బెంగావుండదు" అనుకొన్నాడు.

హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్ళాకకానీ తనకి ఏ విషయం తెలీదు. ప్రస్తుతం ఈ కీకారణ్యం మధ్యలో వున్నాడు. ఇంకా రెండు రోజులు నడవాలి. గడువులోపల డెస్టినీ చేరాలి.

మరో సిగరెట్ వెలిగించాడు. తలతిప్పి చూశాడు. అందరూ నిద్రలో వున్నారు. కానీ తనకి నిద్రరాదు. పులి ఛాయలు కనబడ లేదు. తిరిగి అటురాలేదు పులి. మాధవ ఆలోచనతో అలాగే కూర్చున్నాడు. తూర్పు తెల్లబడుతోంది.

• • •

ఫోర్ ఏసెస్ బార్ కోలాహలంగా ఉత్సాహంగా వుంది. ఇంద్రలోకంలా వుంది.

కల్పన డాన్స్ చేస్తూ ప్రతి టేబిల్ దగ్గరికీ వెళుతోంది. కవ్విస్తోంది. ఆడుతోంది, పాడుతోంది, నవ్వుతోంది. కానీ ఆపూట చాలా ఆలస్యమైంది. మనసంతా జయపైన, ఇంటిమీద వుంది. ఎప్పుడెళ్ళి యింట్లో వాలదామా అనివుంది. అయినా తన డ్యూటీ ప్రకారం డాన్స్ చేస్తోంది.

ఓ టేబిల్ దగ్గర కూర్చున్న మనిషినిచూసి వులిక్కిపడింది కల్పన. మేనకా హోటల్లో తనని అల్లరి పెట్టడానికి ప్రయత్నం చేసిన ఆ రాస్కెల్‌గాడు పాపారావుగాడు తనని వెకిలిగా, ఆకలిగా చూస్తున్నాడు.

ఆక్షణంలో ఏదో భయం ఆమెగుండెల్ని ఆవరించింది. వాడు లేచివచ్చి ఏదన్నా అసభ్యంగా ప్రవర్తిస్తాడేమోనని కంగారు పడింది.

డాన్స్ పూర్తి అయింది. లైట్లు డిమ్‌కాగానే అక్కడొక్క క్షణం నించోకుండా లోపలికి పరుగుతీసింది. అయిదే అయిదు నిముషాల్లో మేకప్ తీసేసుకొని ఆటోలో కూర్చుంది. టైం పన్నెండున్నర అవుతోంది. మొహాన్ని పట్టిన చిరుచెమటని పమిట చెరుగుతో తుడుచుకొంది కల్పన.

ఆటో బషీర్‌బాగ్‌దాటి పబ్లిక్‌గార్డెన్ రోడ్డులోంచి దూసుకెళుతోంది.

అసలే మనసు సరిగాలేక సతమత మౌతుంటే ఆ దొంగ వెధవ దర్శనం ఇచ్చాడు. దాంతో మనసులో ఆందోళన పెరిగింది. ఆటో రాజభవన్ రోడ్డులోకి తిరిగింది. వందగజాలు పోయాక రోడ్డుకడ్డంగా నల్ల అంబాసిడర్ కారు ఆగివుంది. కారుకి బోనెట్ వైపు ఇద్దరు, వెనకవేపు ఒకరు నించుని ఆటోని ఆపారు.

అందులో ఒకడొచ్చి ఆటో డ్రైవర్ని బలంగా మొహం పైన ఒకటి కొట్టాడు. కల్పన గుండెల్ని అరచేతుల్లో పెట్టుకొని కూర్చుంది. కారుదగ్గర్నుంచి మిగిలిన ఇద్దరూ ఆటో దగ్గరకు వచ్చారు.

"ఏమిటీ దౌర్జన్యం" అంది కల్పన.

వాళ్ళు మాట్లాడలేదు. కల్పన చెయ్యిపట్టుకొని క్రిందకి గుంజారు. కల్పన అరవడానికి వీలులేకుండా నోరు నొక్కేసి కారు వెనకసీట్లో పడేశారు. కారు కదిలింది. కల్పనకి అర్థం అయింది. మరికొన్ని క్షణాల్లో తన జీవితం నాశనం కాబోతుంది. కారులో మొత్తం నలుగురున్నారు. అందులో ఒకడు పాపారావు.

సిగరెట్ వెలిగించి పొగమొహంపైకి వూదాడు పాపారావు. వూపిరి ఆడక కల్పన ఉక్కిరి బిక్కిరి అవుతుంటే నలుగురూ పగలబడి నవ్వారు.

ఆ కారుకి ఏదనా ఏక్సిడెంటుజరిగి మూకుమ్మడిగా అందరూ అక్కడికక్కడ చస్తే బావుండనిపించింది కల్పనకి.

కల్పన గింజుకోడానికిగానీ, అరవడానికిగానీ ఏవిధమైన అవకాశం ఇవ్వకుండా జాగ్రత్తపడ్డారు ఆ హంతకులు.

కారు ఎటు వెళుతోందో తెలీక కొన్ని క్షణాల్లో జరగబోయే ప్రమాదాన్ని తలుచుకొని కన్నీళ్ళు నిండుకున్న కళ్ళతో నిస్సహాయంగా చూస్తుండిపోయింది కల్పన.

* * *

కల్పన ఇంటికి రాకపోయేసరికి జయ మనసు అనేక శంకలతో నిండిపోయింది. భోజనంకూడా చేయకుండా ఎదురుచూసింది. అదీకాక ఓ గంటనుంచి కడుపులో కుడిప్రక్కగా నొప్పిగావుంది. బాధని భరిస్తోంది కానీ క్షణం క్షణం ఎక్కువయిపోతోంది నొప్పి. మంచంమీద పడుకొని మెలికలు తిరిగిపోతోంది జయ. ప్రాణం కానీ పోదుకదా అన్నభయం గుండెల్లో చోటుచేసుకొంది.

చుట్టుపక్కల ఎవరూ తనకి తెలీదు. ఎటు కాని సమయం అది. కల్పన యింకారాలేదు. ఏమైనట్టు? నొప్పికి తట్టుకోలేక 'అమ్మా' అంటూ బావురుమంది. ఆ నిశ్శబ్ద ప్రదేశంలో, రాత్రి మూడు గంటలవేళ, ఓ ఆడపిల్ల దిక్కులేక అల్లాడిపోతుంటే గుండెకరగని వాళ్ళుండరు. కానీ కానీ ఎటుచూసిన అంతా దురదృష్టమే ఆమెకి.

కల్పనకేపో అయింది. లేకపోతే రాకుండా వుండదు. తనని ఒంటరిగా వదిలి ఎక్కడికి వెళ్ళదు. ఆ సంగతి జయకి తెలుసు.

ఆలోచించడానికే దగగావుంది. లాభంలేదు. తన ప్రాణం పోతుంది. దిక్కులేని మనిషిగా ఆ గదిలో తన ప్రాణాలు పోవల్సిందేనా? తన ప్రాణం పోయింతర్వాతైనా కల్పన వస్తుందా?

దిండుతో పొట్టని ఒత్తుకుంటూ విలపిస్తోంది జయ.

కన్నవారు లేరు.

పెంచిన మేడమ్ తనని గెంటేసింది.

ప్రేమించిన ప్రియుడు ఎక్కడో తెలీని దూరతీరాల్లో వున్నాడు.

మిగిలింది ఒకే ఒక మనిషి. ఆ మనిషి కల్పన. అది ఏమైంది? ఎక్కడికి వెళ్ళినట్టు? ఏం చేస్తున్నట్టు?

వాంతి అవుతున్న అనుమానం.... ఆ బాధతోనే లేచి బాత్‌రూంలో కెళ్ళింది వాంతి చేసుకొంది జయ. తల తిరిగిపోతోంది. శరీరంలో ఏదో జరుగుతోంది. నరాలు మెలితిప్పినట్టు, ప్రాణాన్ని అంచెలంచెలుగా తీసేస్తున్నట్టు "నరకం" అంటె ఇదేనా అనిపించేలా చేస్తోంది జయకి.

తూలుతూవెళ్ళి చాపపైన వాలిపోయింది జయ.

* * *

కల్పన నిస్సత్తువగా గదిలోంచి హాలులో అడుగుపెట్టింది. ఎదురుగా తనజీవితాన్ని కొల్లగొట్టి దోచిపేసిన కిరాతకులు హేళనగా నవ్వేరు. ఎఱ్ఱెక్కిన కళ్ళతో అసహ్యంగా చూసింది వాళ్ళని. ఎదురుగా కన్పిస్తున్న అద్దంలో తన ప్రతిరూపాన్ని చూసుకొని అసహ్యించుకొంది కల్పన.

జుట్టు రేగిపోయింది. జాకెట్ చిరిగిపోయింది. పీలికలై పోయిన జాకెటీ.... నలిగిపోయిన చీర, మొహంపైన గీరుకుపోయిన గోళ్ళ గుర్తులు, పెదవులపైన బలంగా దిగిన పంటి గాటులు.... కల్పన వొళ్ళువెల్లా వణికిపోతూ ఒక్కసారి కళ్ళు

చూసింది. పైకి నిర్వికారంగా కనబడుతున్నా మనసు ఏడుస్తున్నట్లు, గుండె పగిలిపోతున్నట్టు అదురుతోన్న ఆమె కంఠం చాటి చెబుతోంది.

పశువులకంటె హీనంగా తనని చెరచి దాహాన్ని తీర్చుకున్న ఆ నరాధములకేసి భద్రకాళిలా చూసింది. మరో సామాన్యమైన మనిషి అయితే ఆ చూపులకి తట్టుకోడం సాధ్యంకాదు. నిలువునా మాడి మసైపోవాల్సిందే. కానీ అక్కడ మానవత్వానికి చోటులేదు. రాక్షస ప్రక్రియగల ఆ పశువులు విరగబడి నవ్వేశాయి.

పాపారావు కఠినంగా అన్నాడు.

“ఏమే, ఆరోజు గుర్తుందా? నా మొహంపైన పొడిచి ఈ గుర్తులు చిరకాలం వుండేలా చేశావు. నువ్వు యే అందాన్ని పెట్టుకొని బ్రతుకుతున్నావో ఆ అందాన్ని పాడు చేస్తున్నాను. నిన్ను ఓ కురూపిగా తీర్చిదిద్ది పంపిస్తాను.” అంటూ చేతులో కాలుతున్న సిగార్‌తో కల్పని దగ్గరగా వచ్చాడు.

కల్పన బెదరలేదు. మాట్లాడలేదు. చేతిలోని సిగార్ ఏష్‌ని దులిపి పాపారావు నవ్వేడు. పగలబడి నవ్వేడు. హేళనగానవ్వేడు.

డబ్బాలో రాళ్ళుపోసి ఆడించినట్టు కొండపైనించి రాళ్ళు దొర్లుతున్న శబ్దంలా వుందానవ్వు.

“ఈ చుట్టతో నీ లేత బుగ్గల్ని కాలిస్తే బాగుంటుది కదూ” కల్పన మెడపట్టుకున్నాడు పాపారావు.

అదిచూసి మిగిలిన ముగ్గురిలో ఒకడన్నాడు.

“పాపా, నీకు జరిగిన అవమానానికి పరిహారంగా చక్కని సుఖాన్నిచ్చింది. ఒదిలెయ్ పాపం ఆడపిల్ల.”

రెండోవాడు అన్నాడు.

“అవునుగురూ, దీన్ని అంద వికారంగాచేస్తే మనకే నష్టం. ఏదో అప్పుడప్పుడు మన మొక్కుబడి చెల్లిస్తుంది. వదిలెయ్.”

ఆ మాటలు వినేకంటే చెవులు బద్ధలైపోతే బావుండనిపించింది కల్పనకి.

పాపారావు విసురుగా వెనక్కి తిరిగాడు. "తిసుకువోయి దీని వదిలేసి రండి."

కల్పనని కారులో ఎక్కించుకొని బయలుదేరారు. మిగిలిన ముగ్గురు. టైం అయిదు దాటుతోంది. తూర్పున తెల్లవారుతోంది.

కారు రోడ్డుపక్కగా ఆపి

"ఊఁ దిగు అన్నాడు డ్రైవింగ్ సీటులోని మనిషి. కల్పన కారుదిగి కారుకేసి చూసింది. అందులో ఒకడు ఏమనుకున్నాడో ఏమో, గభాల్న కారు దిగాడు. పర్స్‌తీసి ఓ అయిదు వంద రూపాయలు నోట్లు కల్పన బ్యాగ్‌లోవేసి తిరిగి కారెక్కాడు.
కల్పన భారంగా కదిలింది. రైలుకట్టప్రక్కగా నడుస్తోంది.

పీపుచుట్టుతా పమిటకప్పుకొని, నడిసముద్రంలో తుఫానులో చిక్కుకున్న నావలా వూగిపోతోంది కల్పన. వాయుగుండంపడిన సముద్రంలావుంది ఆ చితికిపోయిన మనసు. కల్పనకి జరిగింది ఓ రీలులా కళ్ళముందు తిరిగింది. ఏడుపొచ్చింది. గుండె పగిలింది.

"ఛీ వెధవబ్రతుకు, ఇంకా ఎందుకు ?"

తనపైన తనకే రోతకలగ్గా చచ్చిపోవాలనుకొంది. ఎదురుగా రైలు దూరంగా వస్తోంది, జీవితానికి విముక్తికలిగించాలి. కన్యాత్వాన్ని పశువులకి దారపోసినతర్వాత ఆత్మాభిమానంగల తన లాంటి ఏ ఆడది బ్రతకలేదు. తనీపరిస్థితినించి, ముక్కలు చెక్కలు అయిన బ్రతుకునించి బయటపడాలంటే ఒకటే మార్గం. చావు. చావేమార్గం. దృఢమైన నిశ్చయానికి కల్పన రాకముందే జయ కళ్ళముందు కదిలింది.

జయ,

తన ఆదరణ, తనులేకపోతే జయ ఏమైపోతుంది? తను జయకిచ్చిన మాట ఏంకాను? పదిగజాల దూరంలోవుంది రైలు. అంతే రైలుకట్టపై కల్పన పక్కకి తప్పుకొంది. మరుక్షణంలో భూదేవిని అదరగొడుతూ రైలు వెళ్ళిపోయింది.

తను అనాథ. ఎవరూలేరు తనకి, ఏ ఆశనీ తన మనసులో పెట్టుకోలేదు. జీవితాన్ని గురించికూడా ఎప్పుడు ఏ విధమైన కలలూ కనలేదు. తనకున్న ఒకే ఒక ఆశ, అనుబంధం.... జయ. ఆ జయకోసం తను బ్రతికాలి.

అవును. బ్రతకాలి.

కల్పన గబగబ నడిచింది. పావుగంటలో ఇల్లుచేరుకుంది. డాబా మెట్లు ఎక్కి గుమ్మంలో అడుగుపెడుతూనే నిశ్చేష్టురాలయింది కల్పన.

జయ.... జయ మెలికలు తిరుగుతోంది. గదిలో వాంతి చేసుకున్న ఛాయలు కనబడ్డాయి. గదిలోకి ఒక్కవురుకులో వెళ్ళింది

"జయ.... జయా యేమైందమ్మా!" అడిగింది కల్పన. జయ బాధగా మూలిగింది. కన్నీళ్ళతో చెప్పింది.

"నేను చచ్చిపోతున్నాను."

ఆమాటలు కల్పన గుండెల్లో చెయ్యిపెట్టి కెలికినట్టయింది.

"నేను రాలేదని కోపమా, వచ్చేశానమ్మా, నీకోసం వచ్చేశాను" అంది కల్పన యేడుస్తూ.

జయ కళ్ళుతెరచి చూసింది. కల్పననిచూసి బెంబుపడినట్టు వులిక్కిపడింది. అంత బాధనీ మరచిపోయి

"ఏమిటి? ఏమైంది?" అడిగింది.

కల్పనకి వెంటనే సమాధానం తట్టలేదు. తర్వాత చెప్పింది. "ఏక్సిడెంటు అయింది అంతే" అంది. అంటూనే జయ పరిస్థితి గమనించింది? నిమిషాల్లో తయారైపోయింది కల్పన. ఆటో తీసుకొచ్చి జయని ప్రైవేట్ నర్సింగ్‌హోంకి తీసుకెళ్ళింది.

డాక్టర్ వెంటనే పరీక్షచేసి "ఎపెండిసైటిస్" అంది.

కల్పన గుండె ఝల్లుమంది.

డాక్టర్ జయకి ఆపరేషన్‌కి అన్ని యేర్పాట్లు చేసింది.

కల్పన మనసులోనే దేవుణ్ణి ప్రార్థించింది.

"భగవాన్ జయనికాపాడు. విన్నింతకుమించి ఏమీ కోరను.

ఆయని ఆపరేషన్ థియేటర్లోకి తీసుకెళ్ళారు. కల్పన బాగ్ తీసి చూసింది.

నలిగిపోయిన అయిదు వంద కాగితాలు పరిహసిస్తు కన బడ్డాయి. కల్పన పెదవులపైన సజావుగా తేలిపోయింది ఓ నవ్వు. తన దగ్గిర డబ్బులేదు. కానీ కానీ తను నలిగిపోయినందుకు వాళ్ళి చ్చిన ప్రతిఫలం.... అదీ అందులో ఒకడు, జాలిపడి తన బాగ్‌లో వదేసి వెళ్ళాడు. చిత్రం.... అదీ అవసరానికి ఉపయోగపడుతోంది. ఆ సంఘటన ఇందుకోసమే జరిగిందా అనిపించింది కల్పనకి.

కల్పన బల్లపైన కూర్చుంది.

ఆపరేషన్ పూర్తిచేసి డాక్టర్ వచ్చింది.

"డాక్టర్" అంది కల్పన ఆందోళనగా.

"పదో అరగంట ఆలస్యం అయితే ప్రాణం దక్కేది కాదు." అంది డాక్టర్.

"కల్పన బరువగా నిట్టూర్చింది.

"ఇప్పుడు ఫర్లేదుగా" అడిగింది ఊపిరి తీసుకొంటూ.

"ఆఁ" అంది డాక్టర్.

ఆ సాయంత్రం కానీ జయకి స్పృహరాలేదు.

నీరసంగా అడిగింది.

"నేనింకా బ్రతికే ఉన్నానా కల్పనా !"

"నీకేం భయంలేదు. నేను బ్రతికి వుండగా నిన్ను చచ్చి పోనిస్తానా ?" అంది కల్పన.

జయ బాధగా నవ్వింది.

"నాకోసం నువ్వు కోరి కష్టాలు తెచ్చుకుంటున్నావు," ఆ మాటలు ఎక్కడోనూతిలోంచి వినబడుతున్నట్టున్నాయి. జయకేసి వాత్సల్యంగా చూసింది కల్పన.

అపురూపమైన సౌందర్యరాశి। సుగుణాలరాశి జయ అలా నిస్సహాయంగా ఓ శవంలా ఆసుపత్రిలో మంచంపైన పడుంటే మనసు తరుక్కుపోయింది.

"డబ్బెక్కడిది?" అడిగింది జయ.

"అవన్నీ నీకెందుకు? నేను చూసుకుంటాను."

జయని చూడ్డానికి ప్రసాదు వచ్చాడు. కల్పన జయకి సుస్తీ చేయడంతో హోటల్‌కి డాన్స్‌కెళ్ళడం మానేసింది. వారంరోజులు పాటు రానని చెప్పింది. ప్రసాదు, కల్పన జయని జాగ్రత్తగా చూస్తున్నారు.

—ఆ సాయంత్రం కల్పనతోబాటు మాధవ తల్లి ఆసుపత్రికి వచ్చింది.

జయని తీసుకెళ్ళడానికి ఆవిడ ఇంటికొచ్చింది. కల్పన ద్వారా అన్నీ వివరంగా తెలుసుకొని కల్పనతోకలిసి జయని చూడ్డానికి ఆసుపత్రికి వచ్చింది.

"జయా!" కల్పన పిలిచింది.

"ఊఁ" అంది కళ్ళు తెరవకుండానే.

"నీ కోసం ఎవరొచ్చారో చూడు" అంది కల్పన.

జయ కళ్ళువిప్పి చూసింది.

ఎదురుగా తనకి అతిసమీపంలో నించుని తననేచూస్తున్న ఆ నిండుమనిషిని గుర్తుపట్టింది.

"అత్తయ్యా!" అంది కన్నీళ్ళు పెట్టుకొంటూ.

"నేనొచ్చానమ్మా. ఇక నువ్వేమీ దిగులుపడకు," అంది శాంతమ్మ మంచంపైన కూర్చొని జయ తలపైన నిమురుతూ.

"నేనింకా గుర్తున్నానా అత్తయ్యా!" అడిగింది.

శాంతిమ్మ ప్రేమగా చూస్తూ నవ్వింది.

"నిన్నెలా మరచిపోతానమ్మా, నువ్వు నా బంగారు తల్లివి. నిన్ను తీసుకెళ్ళాలనే వచ్చానమ్మా, మధు నీకు రాసేవుంటాడు" అంది.

"అవును, రాశాడు" అంది ఎటో చూస్తూ.

శాంతమ్మ జయతో మాట్లాడుతోంటే కల్పన అక్కణ్ణించి వరండాలో కొచ్చింది.

జయకి తనకి ఋణం తీరిపోతుందన్న సంగతి తెలుస్తూనే వుంది. జయని మధూకి ఒప్పగించాలన్నదే తననిర్ణయం. కానీ.... కానీ జయ లేకుండా తనోక్షణం బతగ్గలదా? అసలుండగలదా?

ఆమె కళ్ళకి వరదొచ్చింది. అక్కడెవరూ లేకపోవడంతో వెక్కి వెక్కి యేడ్చింది కల్పన.

తల్లీ తండ్రి ఎలా వుంటారో తనకి తెలీదు. వాళ్ళ ప్రేమా, అభిమానం ఎలాంటిదో తనకి తెలీదు. దిక్కులేని ఓ అనాధ బాలికగా కళావతి చెంతన పెరిగింది. తనకంటే చిన్నదైన జయపైన ఆశల్ని పెంచుకొంది. బంధాన్ని బలపరచుకొంది. మమకారాన్ని గుండెల్లో రంగరించుకొంది. జయని ఓ తల్లిలా సాకింది.

ఈనాడు జయ ఒక్కసారిగా దూరం అయితే తన పరిస్థితి యేమిటి? దారేమిటి? తనేమైపోవాలి?

కల్పన పిచ్చిగా నవ్వుకుంది.

అయినా పతనమైపోయికూడా తనకి యింకా ఎందుకీ తపన, యేం సాధించాలని?

కానీ ఓటమిని అంగీకరించడానికి మనసు అంగీకరించడం లేదు.

కాంతమ్మ వచ్చి భుజంపైన చెయ్యివేస్తే వులిక్కిపడింది కల్పన. కన్నీరు తుడుచుకొంది.

"చూడమ్మా, ఆసుపత్రినుంచి ఇంటికొచ్చాక జయని తీసుకెళతాను. నీ ఋణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలీడంలేదు" అంది.

కల్పన బలవంతంగా చిరునవ్వుని తెచ్చిపెట్టుకుంది.

"పెద్దవారు. అదేంమాట. నాకు కావల్సింది జయ సుఖం అంతే" అంది.

కాంతమ్మ వెళ్ళిపోయింది.

తర్వాత జయకి చూడాల్సిన ఏర్పాట్లు పూర్తిచేసి ఇంటికొచ్చేసింది కల్పన.

ఆకలిగా వుంది. కానీ భోజనంపై ధ్యాసే లేదు. అన్యమనస్కంగావెళ్ళి పిట్టగోడపైన కూర్చుంది.

ఎటుచూసినా నగరం అందంగా కనిపిస్తోంది. చల్లనిగాలి శరీరానికి తగులుతోంది. చుట్టూవున్న ఖరీదైన మేడల్ని చూసింది. ఓసారి ఆకాశంకేసి చూసింది. విశాలంగా అంతూ పొంతూలేకుండా కనబడింది ఆకాశం.

ఆ పశువులు కల్పన చెంపలపైనా చేతులపైనా వక్షోజాలపైనా కొరికి రక్కినగాట్లవలన నల్లగా కమిల పోయింది ఒళ్ళు.

తను చెడిపోయింది. కాదు చెడగొట్టబడింది. ఒక్కసారి

చేసినా సదిసార్లు చేసినా ఒక్కటే. ఒకరు కాదు. ఇద్దరుకాదు, నలుగురు.... నలుగురి చేతుల్లో అమానుషంగా నలిగిపోయింది. బలవంతంగాఅనుభవించబడింది.

డబ్బు ఎంత పెద్దదో తనకి తెలుసు. ఆ డబ్బుకోసం మనిషి ఎంత చెడ్డవాడవుతాడో కల్పనకి తెలుసు. తను చెడిపోయింది. చెడిపోయిన తన బ్రతుకుతో కొంతమంది విలాస పురుషులకి అవసరం వుంటుంది. కల్పనకి ఆ సంగతి తెలుసు. తనకోసం వెర్రిగా, ఆశగా చూసే ఎంతమందో తెలుసు. వాళ్ళ అవసరాలకి తను ఉపయోగపడాలి. డబ్బు సంపాదించాలి. తనకి కావల్సిన నిత్య అవసరాలతోపాటు కోరికలుతీరే సదుపాయాలనికూడా ఏర్పరచుకోవాలి.

ఓ అందమైన ఇల్లు, ఖరీదైన ఫర్నిచర్. టెలిఫోన్, కారు అన్నీ కావాలి. ఇవన్నీ సంపాదించుకోగలిగిననాడు చేతిలో కావాల్సిన డబ్బువున్న రోజున తనని ఎవరూ వేలెత్తి చూపలేరని కల్పన నమ్మింది.

అంతే! లేడికి లేచిందే పరుగు అన్నట్టుగా కల్పన గబగబా లేచింది. డ్రస్ వేసుకొని బయటకొచ్చి మనసులోకొచ్చిన ఆలోచనని వెంటనే కార్యరూపంలో పెటదలుచుకొంది. అయిదు నిమిషాల్లో దొరికిన ఆటో ఎక్కి ఫోక్ ఏజెన్సీకి వెళ్ళింది. ఇదివరకట్లా రిజర్వ్ డుగా కాక లోపలకడుగుపెడుతూనే 'హాయ్' అంటూ అందర్నీ పలకరించింది.

చేసే నాట్యంలో సైగం, కవ్వించడం, కన్నుకొట్టడం, కైపెక్కించడంలో బాగానిరూపించుకొంది. నాట్యం పూర్తికాగానే మనసు పడినవాళ్ళతో వెళ్ళడం.... అయితే అవన్నీ చాలా రహస్యంగా ఏర్పాటుచేసుకొంది. ఇప్పుడు కల్పనకి చీకట్లో ఇంటికి వెళ్ళాలన్న భయం, అన్నీ పోయాయి. ఎవరో ఒకరు ఇంటివరకూ ఏ కారులోనో దింపుతున్నారు.

జయ కల్పనలో వస్తున్న మార్పుని గమనించినా "ఇలాంటి డాన్స్ చేసే మనిషికి అలా కాస్త ఫ్రీగా వుండకతప్పదేమో" అనుకుని సరిపెట్టుకొంది.

ఓరోజున జయనిఇంటికితీసుకొచ్చింది కల్పన. ఆరోగ్య

పరిస్థితి సరిగాలేని కారణంగా టి.వి. ప్రోగ్రాం కాన్సిల్‌చేయబడింది.

కల్పన చెప్పింది.

"నేను వచ్చేసరికి ఆలస్యం కావచ్చు. బెంగపెట్టుకోవద్దు."

"అదేం! ప్రోగ్రాం అవగానే వచ్చేయొచ్చుగా."

కల్పన జయ చెంపపైన ముద్దు పెట్టుకొంది.

"నిజమే. కానీ ఎంతకాలమనిలా. అందుకే ఉద్యోగంలో మరికొన్ని బాధ్యతల్ని పెంచుకొన్నాను. త్వరలోనే ఈ ఇల్లు మారి పోతాం. ఇంటి ఫర్నిచర్ కొంటాం. అదృష్టం బాగుంటే చాలా కొద్ది కాలంలోనే కారు కూడా వస్తుంది." అని "ఓ సారీ, మర్యాద తప్పకమా! ఏమో ఆశపడ్డాను. ఒంటరివాన్ని నాకెందుకులే," అంది కల్పన.

"నిన్నొదిలి నేనొక్కదాన్నే వెళ్ళిపోతాననుకున్నావా కల్పనా." అడిగింది జయ.

"లేకపోతే నన్నుకూడా తీసుకెళతావా?"

"నువ్వెళ్ళబోయేది మీ అత్తగారింటికి," ఆ మాటలకి జయ సిగ్గుపడింది.

కల్పన భారంగా అంది.

"అసలు ఆడపిల్లగా పుట్టడమే దురదృష్టమే. ఎందుకో తెలుసా? పుట్టినప్పటినుంచి గారాబంగా పెంచుకొన్న తల్లి తండ్రుల్ని, అక్కా చెల్లెళ్ళని. అన్నదమ్ములని అందర్నీ ఒదిలి 'పెళ్ళి' అనే మూడు ముళ్ళతో మరో మనిషితో వెళ్ళిపోతుంది. అతనే సర్వస్వంగా నమ్ముకొని, అతనితో కలిసి ఓ కొత్త ప్రపంచంలో పడి బతకడం నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది,

నిన్నుకూడా "ఓ అత్తగారింటికో, మామగారింటికో పంపిస్తే సరి" అంది జయ.

"నన్నా!" పకపక నవ్వేసింది కల్పన.

"అదేం నవ్వుతావు?"

"ఈ కల్పన జీవితం కల్పనగా మారిపోయింది జయా, నేను పూజకి పనికిరాని పువ్వుని."

జయ ఆ మాటలకి నొసలు చిట్లించి చూసింది.

"అంటే?"

"నేను అనాధని" అంది తేలిగ్గా నవ్వటానికి ప్రయత్నం చేస్తూ కల్పన.

"అలా అనుకుంటే నేనూ అంతేగా!"

"నువ్వు అనాధవికాదు. అందర్నీ పోగొట్టుకున్న దానివి. తిరిగికొందర్ని కలవబోతున్నదానివి. కానీ నేనలాకాదుగా, ఓ మనిషిని గుర్తుపట్టే ఊహ వచ్చేసరికి నేను ఒకరి అదరణలోపడి పెరుగుతోన్న సంగతి తెలిసింది."

"నువ్వు పెళ్ళిని గురించి ఎందుకు ఆలోచించవు!"

జయ మరోమాట మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా కల్పన వెళ్ళిపోయింది. జయకి అర్థంకాక అలాగే వింటునిచూస్తూ వుండిపోయింది.

* * *

జయ మధూ తల్లి శాంతమ్మకోసం ఎదురుచూస్తోంది. ఆసుపత్రినించి వచ్చి వారం అయింది. అయినా ఆమెరాలేదు. ఎందుకు రాలేదో అర్ధంకాలేదు జయకి. అవిరగానీ అభిప్రాయాన్ని మార్చుకొందా అన్న అనుమానం కలగకపోలేదు మరోపక్క జయకి.

"ఈ రోజు మనం ఇల్లు మారుతున్నాం," అంది కల్పన.

"ఇది బాగానేవుందిగా?" అంది జయ.

కల్పన ఉద్వేలాసంగా నవ్వింది.

"రోజు గడిస్తే ఓ మెట్టు పైకెక్కాలి జయా. పట్టుదలా ఆత్మస్థైర్యమూవుంటే భవిష్యత్తుకోసం మనం ఎదురుచూడనవసరంలేదు. అదే మనల్ని వెదుక్కొంటూ వస్తుంది. అంది.

వున్న కొద్దిపాటి సామానునీ పాక్‌చేశారు. అటోలో బంజారా హిల్స్‌లోవున్న ఓ ఖరీదైన ఇంటికి చేరారు. జయ ఆశ్చర్యంగా చూసింది కల్పనని.

"ఇంత పెద్ద ఇల్లు మనకెందుకు? అద్దెభరించగలమా!" అంది.

"ఆఫ్టారల్ ఫస్‌థౌజండ్. అంటే వెయ్యి." అంది కల్పన.

"అంత డబ్బు మనకెక్కడిది?"

"అంత డబ్బు సంపాదించడంలేదూ?" అంది.

కొద్దిసేపట్లోనే సోఫాసెట్లు, డైనింగ్ టేబిల్, కుర్చీలు, అందమైన మంచాలు, ఫోమ్‌బెడ్, గాడ్రెజ్ బీరువా ఇతరవస్తువులన్నీ చేరాయి.

"నువ్వేదో మాయచేస్తున్నావనిపిస్తుంది, నిజం చెప్పు. ఇది కలా? నిజమా?" అడిగింది జయ.

"నిజమే," అంటూ కల్పన అన్ని సామానులని దగ్గరుండి ఏది ఎక్కడపెట్టాలో చెబుతోంది పనివాళ్ళతో.

"చూడు జయా ఈ రోజు నుంచి మనం వంట చేసుకోనవసరం లేదు, వంట మనిషి వస్తుంది."

"అలాగే," అంది.

సాయంత్రానికల్లా ఇల్లు అధునాతనంగా తయారు అయింది. జయకి మనసులో కల్పన మీన అనుమానంగా వుంది.

ధైర్యంచేసి అడగలేక పోతోంది.

కల్పన సాయంత్రం బయలుదేర బోతుంటే

"నేను కూడా నీతో వస్తాను." అంది జయ.

కల్పన అడుగు ముందుకి వేయబోయేదల్లా ఆగి, తిరిగి వెనక్కివచ్చి సోఫాలో కూర్చుంది,

"నువ్వక్కడికి రాకూడదమ్మా."

"నేను రాకూడని చోటుకి నువ్వెళుతున్నావన్న మాట"

"ఆ పద్ధతులు నీకు నచ్చవు. అక్కడికొచ్చే జనం చూసే ఆకలి చూపులని నువ్వు భరించలేవు వాళ్ళని కవ్విస్తూ, ఆడిస్తూ నేనాడతాను. అర్ధనగ్నంగా అవసరమనుకుంటే పూర్తి నగ్నంగా నేను కనబడతాను. అలా నన్ను చూస్తే నువ్వు తట్టుకోలేవు."

"కల్పనా..........."

"అలవాటై పోయింది నాకు. నా గురించి నువ్వేం ఆలోచించకు"

"ఇవన్నీ లేకపోతే మనం బ్రతకలేమా,"

"ఎంత కాలం? జీవితం శాశ్వతం కాదు. తృప్తి కోసం వేదాంతి పాఠాల్ని నెత్తినవేసుకొని, ఒకగిరి గీసుకొని దానిలో కూర్చొడం సుద్ద తెలివితక్కువని నేనుచాలా ఆలస్యంగా తెలుసుకొన్నాను. బ్రతికినంతకాలం ఒకర్ని దేవిరించకుండా ఏదికావాలంటే అది మన కాళ్ళదగ్గరికి వచ్చేలా చేసుకోవాలి. అనుభవించాలి. సుఖం అంటే

తెలీకుండా బ్రతికిన బ్రతుకుని మర్చిపోయి మిగిలిన జీవితాన్నైనా సుఖమయం చేసుకోవాలి. అదే నా ప్రయత్నం. అవకాశం వున్నప్పుడే అన్నీ సంపాదించుకోవాలి. ఇప్పుడు వదులుకుంటే తిరిగి మనకి ఏమీ మిగలదు."

"నీ మాటలు అసలు ఏమీ అర్థంకావడంలేదు."

"శాంతకాలం నీకు అర్థంకాకపోవడమే మంచిది."

"అంతేనా."

"అంతే! నువ్వు భోజనంచేసి పడుకో. నా కోసం చూడకు" అని బయటికి వెళ్ళిపోయింది కల్పన. జయకేమీ పాలుపోకచూస్తూ వుండిపోయింది. కల్పన అర్థంకాని ప్రాబ్లమ్‌లా తయారైంది జయకి. జయకి అన్ని సౌకర్యాలు వున్నా మనసు మాత్రం మాధవ్ పైనే వుంది. వస్తానన్న శాంతమ్మత్త గురించి ఆలోచిస్తోంది. ఆమె రాలేదు.

ఇప్పుడిప్పుడే ఆరోగ్యం చక్కబడుతోంది. తనే వెళితే ఎలా వుంటుందన్న ఆలోచన కూడా లేపోలేదు. మధూ దగ్గర్నుంచీ లెటర్స్ రావడంలేదు. తనే రోజువిడిచి రోజు ఓ ఉత్తరం అతనికి రాస్తోంది.

ఎక్కడున్నాడో? ఎలా వున్నాడో?

ఇంకా ఎన్ని రోజులు ఈ నిరీక్షణ?

తల బద్దలవుతోంది.

ఫ్లాస్క్‌లోని కాఫీని కప్పులో పోసుకొని తాగింది. వేరే పనిలేదు. తోచడంలేదు. ఈ జీవితం కంటే కళావతి వుంచిన నాలుగుగోడలే బాగున్నాయనిపించింది.

రెండు రోజులు గడిచినయి.

మర్నాడు ప్రసాదు వచ్చాడు. అతని మొహం వివర్ణమై వుంది. చికాగ్గా వున్నాడు. దేన్నో పోగొట్టుకున్నవాడిలా కనిపించాడు. అతనొచ్చిన సమయంలో కల్పన లేదు.

జయ అడిగింది:

"అలా వున్నారేం. ఆరోగ్యం సరిగా లేదా?"

ప్రసాద్ నవ్వేడు.

"బాగానే వున్నాను" అంటూ పరీక్షగా చూశాడు ఇల్లంతా.

"వెరీగుడ్, బావుంది!" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.
"ఏమిటి?"
"ఇల్లు ఇంద్రలోకంలా వుంది."
"-దంతా కల్పన పిచ్చి. మనకెందుకూ అంటే వినదు. పైగా సంపాదిస్తున్నానుగా అంటుంది."
"ఐసీ!"
ప్రసాద్ సిగరెట్ పైన సిగరెట్ కాలుస్తున్నాడు. ఇద్దరి మధ్యా మాటలు లేకుండానే కాలం పరుగెడుతోంది. ఒకళ్ళతో ఒకళ్ళకి మాట్లాడాలంటే ఏమిటో అనీజీగా వుంది.
"కల్పన ఎప్పుడొస్తుంది" అడిగాడు.
"ఏమో, పన్నెండవుతుంది.
"నేను వెయిట్ చేస్తాను- అభ్యంతరం లేదుగా!"
"పరవాలేదు, కూర్చోండి."
"థాంక్స్."
"ఎలాగో వుంటానంటున్నారుగా. రండి భోజనం చేద్దాం."
"నాకు ఆకలిగా లేదు."
"కానీ నాకు ఆకలిగా వుంది. అతిథిని కూర్చోబెట్టి నేను తినడం తప్పు కదూ!"
"సరే, అయితే నేను రేపొస్తాను."అంటూ లేచి నిలబడ్డాడు.
"వుంటానన్నారుగా! పోనీ నేను కూర్చుంటాను." అంది.
"నో. నే వెళతాను" అని వెళ్ళిపోయాడు.
అతని ప్రవర్తన జయకి చాలా చిత్రంగా తోచింది.
"ఏమిటీ మనిషి?" అనుకొంది.
భోజనం చేసి పని మనిషికి చెప్పి తన గదిలోకి నడిచింది జయ. టేబుల్ డ్రాయర్లోంచి ఓ సీసా తీసి రెండు నిద్ర మాత్రలు వేసుకొని పడుకొంది జయ. నిద్ర సరిగా పట్టకపోవడంతో ఈ మధ్య జయ రాత్రిళ్ళు నిద్రమాత్రలు వాడుతోంది.

* * * *

"నీ కోసం ప్రసాద్ వచ్చాడు. చాలాసేపు ఎదురు చూశాడు" అంది జయ ఉదయం కాఫీ త్రాగుతూ కల్పనతో.
"ఎందుకట?" అడిగింది కల్పన.

జయ అంతా చెప్పింది.

కల్పన సాలోచనగా "ఓహో" అంది.

అలా అన్నదేకానీ మనసులో రకరకాలుగా భావాలు చెల రేగగా ఏసిగా పెదవిని కొరుక్కొంది.

"కల్పనా."

"ఊ"

"అత్తయ్య రాలేదు."

"వస్తుందని ఎదురు చూస్తున్నాంగా"

"ధూ నుంచి ఉత్తరాలూ లేవు.

"కుదిరితే ఓసారి మనమే అత్తయ్య దగ్గర కెళదాం."

ఓ.కే. ఇప్పుడే వెళదాం" అంది కల్పన.

జయ మొహం ఆ మాటలకి విప్పారింది.

"నిజంగా!" అడిగింది జయ.

"నన్నొదిలి వెళ్ళిపోతానని ఎంత తొందరే నీకు." అందికల్పన.

"నన్నొదిలి నేనె క్కడికీ వెళ్ళను."

"మరి తొందర దేనికి"

"మో! అదే విచిత్రంగా తోస్తుంది."

"సరే, పద."

కల్పన, జయ బయల్దేరారు. ఇరవై నిమిషాల్లో శాంతమ్మ ఇల్లు చేరారు.

జయకి ఎందుకో గుండె అదిరింది.

కాంపౌండ్ వాల్ గేటు తీసుకొని మెల్లగా లోపలికినడిచారు.

లోపల శాంతమ్మ సోఫాలో కూర్చుని వుంది. ఆమెచుట్టూ మరికొంతమంది కూర్చుని వున్నారు.

శాంతమ్మ తలెత్తి చూసింది. ఎదురుగా జయ కనబడింది.

"వచ్చావా తల్లీ! రా. మధూ మనిద్దర్నీదగాచేసి వెళ్ళిపోయాడమ్మా!" అంటూ బావురుమంది.

కల్పన ఆ మాటలకి అదిరిపడింది. జయ శాంతమ్మకేసి అదోలా చూసింది. మెల్లగా ఒక్కసారి కళ్ళుమూసుకొంది. రెండు చేతుల్తో చెవుల్నిమూసి, కొన్ని క్షణాలు విలువెల్లా వూగిపోయింది. అంతే! కుప్పలా కూలిపోయింది జయ.

కల్పన కంగారుగా జయని ఒడిలోకి తీసుకుంది.

శాంతమ్మ ఏడుస్తూ చెప్పింది.

"ఆ విమానాలు ఎక్కద్దురా అంటే విన్నాడు కాదు. నా తండ్రి నన్నొదిలి వెళ్ళిపోయాడు. ఒరే బాబూ మధూ జయ వచ్చిందిరా నాన్నా! ఈ అమ్మ కోసం కాకపోతే జయ కోసమైనా రారా బాబూ" అంటూ ఏడుస్తోంది శాంతమ్మ.

"ఏం జరిగిందత్తయ్యా?" అడిగింది కల్పన.

ఎవరో పేపరు అందించారు.

కల్పన ఆత్రంగా చూసింది పేపరు.

విమాన ప్రమాదంలో నూరుమంది మృతి. కింద వరుసగా పేర్లు రాసి ఉన్నాయి. కల్పన కళ్ళలో నీరు తిరిగింది. క్రింది పెదవిని పంటితో నొక్కిపట్టింది.

జయ భవిష్యత్తు పేకమేడలా కూలిపోవటంతో కల్పన రాయిలా అయిపోయింది. జయ పిచ్చి మనసుకి ఎంత గాయం అవుతుంది? జయని ఓదార్చడం ఇక తన తరం అవుతుందా?

జయ కదిలింది కళ్ళు విప్పి చూసింది.

"మంచినీళ్ళు" అంది.

పని మనిషి వెంటనే నీళ్ళు తెచ్చి ఇచ్చింది. తాగి అందరి వంకా చూసింది.

"నాకేమయింది? మీరందరూ ఎందుకలా చూస్తున్నారు?" అడిగింది.

శాంతమ్మ, కల్పన ఒకరికేసి ఒకరు చూసుకున్నారు.

"ఏం కాలేదులే. ఏదో కళ్ళు తిరిగి పడిపోయావ్.

అంతే." అంది కల్పన.

"అత్తయ్యా! మధు ఎప్పుడొస్తాడు?" అక్కడ వున్నవాళ్ళ అందరికీ పరిస్థితి అర్థం అయింది.

ఆ క్షణంలో కొడుకుపోయిన బాధని శాంతమ్మ గుండెల్లో దాచుకొంది.

"వస్తాడమ్మా. నాకోసం కాకపోయినా నీకోసం తప్పకుండా వస్తాడమ్మా!" అంది.

జయ వెక్కి వెక్కి ఏడ్చింది.

"లేదత్తయ్యా, మధు రాడు! నన్ను మోసం చేశాడు. నా కన్నీళ్ళు ఉత్తరాలు కూడా రాయలేదు."

"క్షమించండి ఆంటీ! మేం వెళతాం. ఈ పరిస్థితిలో ఇక్కడ జయని ఎక్కువపేపు వుంచడం మంచిదికాదేమో!"

శాంతమ్మ తలవూపింది.

శాంతమ్మతో పక్కకి పిలిచి చెప్పింది కల్పన.

"జయని మీ దగ్గర వదలాలని తీసుకొచ్చాను. కానీ దాని బ్రతుకుతో దేవుడు మళ్ళీ ఆటలాడాడు. దానిది అసలే సున్నితమైన మనస్తత్వం ఆంటీ! అదిప్పుడు మధు పోయాడన్న వాస్తవాన్ని నమ్మలేకపోతోంది. ఏదో ఉన్మాద పరిస్థితిలో వుంది. అంచేత ప్రస్తుతానికి జయని నేను తీసుకెళతాను" అంది.

శాంతమ్మ "అలాగేనమ్మా, తను ఏ రోజు ఇక్కడికి వచ్చినా నాకు ఏ అభ్యంతరంలేదు. బాబు లేకపోయినా జయ నా కోడలే!" అంది బొంగురుపోయిన గొంతుతో.

"వెళతాను. కానీ ఓ మాట. మీకు చెప్పేపాటిదాన్ని కాదు. విధిముందు ఎంతటివాళ్ళు తలవంచాల్సిందె ఆంటీ! జరిగిపోయినది గుండెనిపిండే దారుణమని తెలుసు. కానీ ఇప్పుడు బాధపడి ప్రయోజనంలేదు. ఇది సంతాపం తెలియజేయడంకాదు. పెద్దమాటలు అంటున్నంత కాదు. పెద్దవారు—అన్నీ తెలిసినవారు. మనసుని దిటవు చేసుకోండి!"

జయ చేతిని తనచేతిలోకి తీసుకొని బయటికివచ్చిందికల్పన.

ఒక్కసారి వెనక్కి తిరిగి ఆ యింటికేసి చూసింది కల్పన.

మూర్తీభవించిన శోకదేవతలా కనబడింది ఆ మేడ.

కళ్ళల్లోకి నీరు వస్తుండగా , గొంతులోంచి మాట సైతం రాని స్థితిలో స్నేహితురాలికి అన్నిటికీ తనే అయి ఆమె వేసే ప్రతి అడుగుకి ఆసరా ఇస్తూ నడిపించింది.

ఇంటికి చేరారు. ఒకరినొకరు ఎదురెదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

జయ నిర్వికారంగా, నిర్జీవంగా ఎటో చూస్తోంది. జయలో చాలా వరకు నిర్లిప్తత చోటు చేసుకొందిప్పుడు. జయ ఏదో షాక్‌లో వుంది. ఆ షాక్‌లో వుంచడమే ఒక విధంగా మంచిదనిపించింది కల్పనకి. కల్పన జయకేసి చూస్తోంది.

'ఈ మనిషి తిరిగి యథాస్థితికి తీసుకురావడం తనకి సాధ్యమేనా?' అని అంతలోనే అనుకొంది.

చిన్న వయసులో వయసుకి మించిన అనుభవాల పాఠాలు... ప్రతి క్షణం ఏదో మలుపు....ఎంతో పాపం చేసుకొని పుడితేతప్ప ఇలాంటిజన్మ రాదు. అయితే జయలాంటి అమాయకురాలు మంచి పిల్ల పాపం చేసి పుట్టిందంటే నమ్మకం కుదరలేదు కల్పనకి. మధు చచ్చిపోయాడన్న సంగతి జయ మరిచిపోయింది.

కల్పన అనుకుంది. 'ఇదీ ఒకందుకు మంచిదే' అని.

జయ లేచి లోపలికి నడుస్తుంటే వెనకగా అనుసరించింది. గదిలో మంచం పైన వాలిపోయింది జయ. దిండులో మొహం దాచుకొని ఏడుస్తోంది.

కల్పన నిట్టూర్పు విడిచి వచ్చి సోఫాలో కూలబడింది.

కడివెడు కన్నీళ్ళు — కొసింత చిరునవ్వు! ఏ సుఖం కోసం జీవితమంతా ఎదురుచూడాలి?

అదే ఆలోచనతో కళ్ళు మూసుకొని కణతలు నొక్కుకుంటోంది. కల్పన.

"నేనొచ్చి అయిదు నిముషాలయింది."

ఆ మాటలకి తలెత్తి చూసింది కల్పన.

ఎదురుగా ప్రసాద్ నిలబడి వున్నాడు.

నవ్వడానికి ప్రయత్నించేస్తూ అంది.

"నిన్న వచ్చారట. సారీ. ప్రోగ్రాం కెళ్ళాను.

"ఏ ప్రోగ్రాం?" అడిగాడు ప్రసాద్.

కల్పన నొసల్లు చిట్లించింది. అతనికి అన్నీ తెలిసే వచ్చాడని కల్పనకి తెలుసు. తెలీనట్టు, తన నోటితో చెప్పించాలని అతను ప్రయత్నం చేస్తుంటే. అది తెలివో,అతితెలివో అర్థంకాలేదు కల్పనకి. కోపం కూడా వచ్చింది.

"నేను కేబరే చేస్తున్నాను. లేకపోతే ఎలా బ్రతుకుతున్నాం అనుకొన్నారు?"

"నువ్వు అలాంటి డాన్సర్‌గా పేరుతెచ్చుకోడం, చేయడం నా కిష్టంలేదు."

కల్పన అతనికేసి తీవ్రంగా చూసింది. అతను మొదటిసారిగా 'నువ్వు' అన్న ఏకవచన సంబోధన చేశాడు.

"ఏం, ఎందుకు?" అడిగింది.

"ఎంత బాధనైనా, అభిమానం వున్న ఒకళ్ళయినా ఉంటే ఆలోచనే మనసుకి శాంతినిస్తుంది, తృప్తి నిస్తుంది. నా దృష్టిలో మనిషికి కావలసింది డబ్బుకాదు. ప్రేమ కావాలి, తనని ప్రాణ సమానంగా ప్రేమించే వ్యక్తి వుంటే కాసేపు ఒక్క క్షణమైనా ఆ ప్రేమలోని తీపిని అనుభవించగలిగితే..........
ఆ అనుభూతి చాలదా మిగిలిన చేదు జీవితాన్ని మరచిపోడానికి" అన్నాడు.

"ఎంత ధైర్యం వున్నా పడిన ముద్ర పోదుగా! నేను చెడిన ఆడదాన్ని."

"కల్పనా!" ప్రసాద్ ఆమెకి దగ్గరగా నడిచాడు.

"తెగిన గాలిపటాన్ని, పొదల్లోనో, చెట్టు కొమ్మల్లోనో చిక్కుకుని చిరిగిపోకముందే పట్టుకోగలిగితే, తిరిగి సూత్రం కట్టి ఎగరవేసే అవకాశం వుందిగా" అడిగాడు.

"కానీ ఈ గాలిపటం చిరిగిపోయింది. తిరిగి ఎగరవేయ టానికి పనికిరాదు!" కల్పన స్థిరచిత్తంతో అంది.

"అంతేనా?"

"అంతే ప్రసాద్! 'ఊబి' అని తెలిసీక కాలువేయడం అవి వేకం. ప్లీజ్, మా బ్రతుకిలా మమ్మల్ని బ్రతకనీయ్. నా జీవి తంలో ప్రవేశించాలని మాత్రం ప్రయత్నం చేయకు. కష్టంలోనో, సుఖంలోనో ఓ ఆప్తుడిగా, మంచిస్నేహితుడుగా నీ అండదండలు నాకుంటే అంతేచాలు. నన్ను అర్థంచేసుకోడానికి ప్రయత్నించేయి. అదీకాక జయ భవిష్యత్తుపైన నేను కన్నకలలు కలలయి పోయి నయి. ఇప్పుడు అదో చిక్కుప్రశ్న అయిపోయింది."

"అంటే"

"ప్లేన్ యాక్సిడెంటులో మధు చనిపోయాడు."

ఆ మాటలకి ప్రసాద్ చకితుడయ్యాడు. ఆ ఒక్కమాటతో ప్రసాదుకి ఆ స్నేహితురాళి పైన జాలి విపరీతంగా కలిగింది.

జయ ఏం చేస్తోంది?"

"లోపల వుంది" అంటూ మిగిలిన విషయాలన్నీ చెప్పిందికల్పన.

జయ గురించి చాలాసేపు మాట్లాడుకొన్నారిద్దరూ. అయితే ఏంచేయాలీ అన్నదే ఇద్దరికీ తట్టలేదు.

ప్రసాద్ తడబడ్డాడు.

"చెప్పండి, సర్లేదు" అంది.

"నీకు చెడ్డపేరు రావడం నా కిష్టంలేదు, అంతే."

"అదే ఎందుకు అని అడుగుతున్నాను."

"కల్పనా! నీ కెలా చెప్పాలో తెలీడంలేదు. నువ్వంటే నా కిష్టం. ఐ లైక్ యూ కల్పనా!" అన్నాడు ప్రసాదు.

అతని మాటలకి కల్పన పకపక నవ్వేసింది. ఆ నవ్వులోనే చిత్రంగా ఆమెకి కన్నీళ్ళు వచ్చాయి.

"నా గురించి నీకేమయినా తెలుసా?" అడిగింది కల్పన.

ప్రసాదు మాటాడలేదు.

"ప్రసాద్ నువ్వేం చెప్పాలని అనుకుంటున్నావో. ఏమి కావాలని అడగాలనుకుంటున్నావో నాకు అంతా తెలుసు."

అని కల్పన లేచి కిటికీ దగ్గరకి నడిచింది. కిటికీలోంచి బయటికి చూస్తూ వెనక్కి తిరిగి చూడకుండానే అతన్ని ఉద్దేశించి అంది.

"ప్రేమించడం కంటె ప్రేమించబడటం లోనే గొప్ప సుఖం వుందని నాకు తెలుసు. నీటికి రంగూ, రుచీ వుండవు. ఐనా ఎందులో పోస్తే ఆ ఆకారం, ఏం చేస్తే ఆ రుచీ. ఆడదీ అంతే! నేలపోస్తే నీరు ఇంకిపోతుంది. ఆడది తప్పటడుగు వేసినాఅంతే!

"అలాని చెప్పి నిండు జీవితాన్ని తెలిసీ నాశనం చేసుకుంటావా?" అడిగాడు ప్రసాదు.

కల్పన వెనక్కి తిరిగింది.

"జీవితం? అది నాకు అర్థంకాని మాట. దాని నిర్వచనం అంతుబట్టక నాకది ఓ గ్రీక్ అండ్ లాటిన్‌గా మిగిలిపోయిన ఓ చిక్కు ప్రశ్నది. అదృష్టవంతులకి జీవితం ఓ కమ్మటి కల కావచ్చు. కానీ దౌర్భాగ్యులకి అదో పీడ కల. జీవితం ఓ వరం అని అదృష్టవంతులనుకుంటే, జీవితం ఓ శాపం అని నా లాంటి దురదృష్టవంతులు అనుకుంటారు. ముగింపు మన చేతిలో లేదు. అది వరమే అయినా, శాపమే అయినా బ్రతకాలి. ఇష్టంగానో కష్టంగానో బ్రతకాలి. తప్పదు!"

ప్రసాదు మెల్లగా అన్నాడు.

ప్రసాద్ వెళ్ళడానికి లేచాడు.

"నామీద కోపం రాలేదుగా!" అడిగింది కల్పన.

ప్రసాద్ బరువుగా నవ్వేడు.

"నువ్వెలాంటి జీవితాన్ని గడుపుతున్నా, నలుగురూ ఏమన్నా అనుకున్నా నేను మాత్రం అనుకుంటున్నాను—ఈ కల్పన మనిషి కాదని.... దేవతని."

"హేళన చేస్తున్నావా ప్రసాద్:" దిగులుగా అంది.

"నిన్ను హేళనచేయడం అంటే నన్ను నేను పరిహసించుకోడమే అవుతుంది కల్పనా." అన్నాడు ప్రసాదు.

"థాంక్యూ!" అంది కన్నీళ్ళని తుడుచుకొంటూ.

"మన మధ్య పెళ్ళి లేకపోవచ్చు. శారీరకమైన సంబంధాలు లేకపోవచ్చు. నీ ఇష్టమైనా, కాకపోయినా నిన్నే నా భార్యగా భావిస్తున్నాను" అంటూ ప్రసాద్ విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ మాటలకి కల్పన చకితురాలైంది.

* * * *

జయ మెల్లగా నౌబత్‌పహాడ్ మెట్లు ఎక్కింది. కట్టుకున్న తెల్లని అమెరికన్ జార్జెట్ చీర పవిట గాలికి రెపరెపలాడుతూ ఎగురుతోంది. తలవెంట్రుకలు ఎగిరి మొహంపైకి పడుతున్నాయి. పరధ్యానంగా వున్నా. ఇదివరలో తరుచుగా తనూ, మధూ కూర్చునే చోటులో వున్న సిమెంటు బల్లపైన కూర్చుంది. జనం కొండపైన చెదురు మదురుగా వున్నారు. జయ ఒంటరిగా అక్కడ కూర్చుంది.

చీకటి పడింది. అయినా దీపాలు వెలగలేదు. కొండపైన. దూరంగా బిర్లా దేవుడి గుడి దీపాల వెలుగులో మెరిసిపోతోంది.

"నా ప్రాణాలు నీ పెదవుల్లో వున్నాయి జయా" మధు మాటలు గుర్తుకొచ్చినయి. ఒళ్ళు పులకించిందో క్షణం. గుండెలు ఎగిరిపడినయి. పవిటచెంగు జారిపోయింది. మనసునిండా, గుండెల నిండా, ఆలోచనల్లో అంతా అంతా మధూనే. జయ మనసెక్కడో వుంది. ఆలోచనలెక్కడో వున్నాయి. ఆమె మధు సాన్నిధ్యంలో వుందిప్పుడు. పెదవులు అదిరాయి. గుండెలు కంపిస్తున్నాయి. శరీరం మైనంలా కరిగిపోతోంది. ఏదో ఆవరాతో లేచి విరుచుంది.

అడుగులు వేసింది. గుబురుగా వున్న పొదలచాటుకి నడిచింది. ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. ఊపిరి సలపడటం లేదు.

"మధూ, ఎందుకిలా నన్ను చంపుతున్నావ్? నేనేం తప్పు చేశాను. ప్లీజ్ నన్ను వదిలి వెళ్ళిపోవుగా." అడుగుతోంది జయ.

"ఊ" అందా గొంతు.

"ప్లీజ్ మాట్లాడు" జుత్తుల్లోకి చేతులు పోనిచ్చి అతని మొహాన్ని గుండెలపైకి లాక్కుంది. చేతి గాజులు చిట్లి చేతులకి గాయమైంది. పెదవి చిట్లి రక్తం స్రవిస్తోంది. తెల్లని జీరమరకలైంది.

"మధూ!" అంది.

అతను గబగబా వెళ్ళిపోతున్నాడు. జయ అతని వెనకే పరుగెత్తింది.

"ఆగు మధూ....నేనూ వస్తున్నాను." అరిచింది. అతను ఆగలేదు. వెళ్ళిపోయాడు, అతని వెనకనే కొంతదూరం వచ్చిన జయ మెట్లపైన కూర్చుని వెక్కి వెక్కి ఏడ్చింది.

"మధూ! ఎందుకిలా చేశావు? నేనేమన్నా తప్పుచేశానా చెప్పు!" అదే ఆలోచనతో ఇల్లు చేరుకుంది దిగులుగా.

"ఎక్కడికి వెళ్ళావ్?" అడిగింది కల్పన.

"మధూ దగ్గరికి!" అంది జయ.

"మధూ దగ్గరకా!" అదిరిపడింది కల్పన. పరీక్షగా చూసింది జయని. నలిగిపోయి రక్తపు మరకలుపడ్డ చీర, గాజులు పగిలి చేతులు గీసుకుపోయిన గుర్తులు, పెదవిమెంచి రక్తం స్రవిస్తున్న చిహ్నాలు చూసి కల్పన నొసట్లు చిట్లించింది.

"ఎక్కడ కలిశాడు?" అడిగింది అమాయకంగా.

జయ నవ్వింది.

"ఇంకెక్కడ....మేం ఎప్పుడూ కలిసే చోటులోనే. అతనలా వస్తాడనుకోలేదు. ఇక నాకే దిగులూ లేదు. మధు వచ్చేశాడు. నా మధూ వచ్చేశాడు" అంది.

"మరిక్కడికి రాలేదే?"

కల్పనకి అనుమానం వచ్చింది. 'జయకి పిచ్చిగానీ పట్టలేదు కదా!' జయ లోపలికి నడుస్తూ వెళుతుంటే అవాక్కయి చూస్తూ వుండిపోయింది కల్పన.

జయ అక్కడికొచ్చి గంట దాటింది.

మధూ రాలేదు. కానీ వస్తాడన్న ఆశ, నమ్మకం జయకున్నాయి. నిరీక్షణలో అతని కోసం ఎదురుచూస్తూ కూర్చోడంలో కాలమే తెలీదు జయకి. చీకటిపడి చాలా సేపయింది. ఇంచుమించుగా అక్కడ నిర్మానుష్యంగా వుంది.

అలాంటి ప్రదేశంలో ఒంటరిగా ఓ ఆడది ఆ సమయంలో కూర్చోడం ఎంత ప్రమాదమో జయకి తెలుసుకానీ. జయకి భయం లేదు. అతనొస్తాడన్న ధైర్యం, నమ్మకం ఆమెకి ఉన్నాయి.

"ఏవో అలికిడి........

'మధూ వస్తున్నాడు' అనుకొంది ఓ ఆకారం ఎదురుగా నించుంది.

"మధూ" అంది.

ఆ ఆకారం మెల్లగా కదిలి జయ దగ్గరకొచ్చింది. జయ లేచి నించుంది. అతని కెదురుగా నించుని భుజాలమీన చేతులువేసి చీకట్లో అతని కళ్ళలో ఏవో వెతకాలని ప్రయత్నం చేసింది.

"ఇంత ఆలస్యం చేశావే? నేనేమై పోవాలనుకున్నావ్? నీ కోసం ఎదురు చూ. లేక కళ్ళు కాయలు కాచినయి. నువ్వు మళ్ళీ యిలా చేస్తే నీకింకెప్పుడు కనబడను" అంది జయ.

అతను జయ నడుం చుట్టూ చేయి వేశాడు. అతని చేతిని తన చేతిలోకి తీసుకొంది జయ. అడుగులో అడుగువేస్తూ నడుస్తున్నారు. ఒకచోట ఆగిపోయాడతను. జయ అతనివేసి చూ.టో యింది. అప్పటికే జయ అతని కౌగిలిలో వుం". అతని ఊపిరి వెచ్చగా మొహానికి తగులుతోంది. శరీరం నలిగిపోతోంది. ఎముకలు విరిగిపోతున్నాయి. అయినా అతన్ని వదలాలని లేదు. ఇంకా ఏదో అయిపోవా.ని వుంద జయకి.

"మధూ మధూ నన్ను చంపేయ్." అంది.

"..........." అతను మాట్లాడలేదు.

నేనిలా ఒంటరిగా వుం లేను. నీతో వచ్చేస్తాను. చెప్ప నన్ను తీసుకెళ్ళవూ! ప్లీజ్ నాకు మాటివ్వు మధూ" అంది.

అతను జయను వదలి దూరంగా జరిగి కూర్చున్నాడు.

"మాట్లాడవే!" అంది. అయినా అతను మాట్లాడలేదు. జేబులోంచి పర్సు తీశాడు. అయిదుపదిశాగితాలుతీపి జయచేతిలోపెట్టాడు.

"ఇదేమిటి?" అంది అయోమయంగా.

"ఇంకా కావాలా" అడిగాడు అతను.

ఆ మాటలకి ఉలిక్కిపడింది. నిద్రలోంచి లేచినట్టయింది. ఆ మనిషికేసి చూసింది పరీక్షగా.

ఎవరో ఆగంతకుడు.

ఎప్పుడూ చూళ్ళేదు.

ఎవరితను? ఏమీ కాదు. జరగకూడనిది జరిగిపోయిందని తెలుసుకొంది జయ. నిలువెల్లా వణికిపోయింది.

కెవ్వున కేకవేసి వెనక్కి విరుచుకొని పడిపోయింది. అంతే అతను పరుగు దీశాడు.

* * *

జయ మెల్లిగా కళ్ళు విప్పి చూసింది.

"నే నిక్కడి కెలా వచ్చాను?" అంది.

"నేనే తీసుకొచ్చాను." కల్పన గొంతునించి ఆ మాటలు శాంత గంభీర స్వరంలో వినిపించాయి.

జయ ఒక్కసారిగా బావురు మంది.

"నేను నాశనమైపోయాను. నేను చచ్చిపోయాను."

కల్పన దీర్ఘంగా నిట్టూర్చింది.

"నేనంతా తెలుసుకున్నాను జయా! వారం రోజుల్లో నువ్వెంత పతనమైపోయిందీ కూడా తెలుసుకున్నాను."

"వద్దు, వద్దు. నాకేం గుర్తుచేయొద్దు. భరించలేను. నా మటుకు నా చేతుల్లో నేనేమయినా పరవాలేదనుకున్నానే కానీ, నేనిలా ఎవరో పశువుల చేతిలో నాశనమైపోతూ వచ్చానన్న సంగతి తెలుసుకోలేకపోయాను. నేనింకా బ్రతికుండి ఏం సాధించాలని? కల్పనా నన్ను చంపేయ్. నన్ను చంపేయ్"

"పిచ్చి జయా, నేనేం సాధిస్తున్నాను కనుక........"

జయ పిచ్చిగా చూసింది.

"అంటే?"

"ఈ కల్పన కూడా ఎప్పుడో నాశనమై పోయింది. గుండెల్లో నిప్పులు కురుస్తున్నా, అవి నిప్పులు కాదు మల్లెపూలే అనుకొని సరిపెట్టుకొంటూ నీ కోసం ఇంతకాలం బ్రతికాను.

నేనేమిటో నీకు తెలీకుండా జాగ్రత్త పడ్డాను. కానీ నా నీడలో వున్న నీపైన కూడా ఆఖరికి నా నీడ పడక మానలేదు."

జయ మంచం పైన బోర్లా పడుకొని ఏడుస్తుంటే కల్పన దిక్కుతోచక ఓదార్చగలిగే స్థితిలో లేక జయ తలపైన చేత్తో ధిమురుతూ వుండిపోయింది.

జయ లేచి కూర్చుంది. మోకాళ్ళపైన తల పెట్టుకొని రెండు చేతులని చుట్టుకుని కూర్చుంది.

అగ్ని పర్వతాలు బద్దలవడానికి సిద్ధంగా వున్నట్టుగా వుంది అక్కడ వాతావరణం.

పైకి ఏడుస్తున్నట్టు కనపడకపోయినా మనసులో కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నట్లుగా జయ కంఠం అదురుతోంది. వున్నట్టుండి వెక్కి వెక్కి ఏడ్చింది. ఏడుస్తూనే కల్పనకేసి చూసి నవ్వింది. పగలబడి నవ్వేసింది.

"ఇంతకాలం మధూ వస్తాడు. అతని జీవితంలో నాకు చోటు ఇస్తాడని ఎదురు చూశాను. మధూ నన్ను, నా ప్రేమనీ, ఈ లోకాన్నీ వదిలి వెళ్ళిపోయాడు. నా జీవి ం నా నుంచి వెళ్ళిపోయింది. బ్రతుకు ముక్కలైంది. కన్యత్వాన్ని పశువులకి ధారపోశాను. తెలిసిచేసినా తెలీకచేసినా నా బ్రతుకు నాదకాకుండాపోయింది."

"కానీ నే నున్నాను జయా."

జయ పెదవులపైన సజావుగా తేలిపోయిందో నవ్వు.

"నాకోసం నీ సర్వస్వాన్ని త్యాగం చేసిన నిన్ను వదిలి ఏదో లోకంలో విహరించాలను కొన్నందుకు దేవుడు నాకు విధించిన శిక్ష ఇది, అక్కా............"

"చెల్లీ."

"నేనూ నీకున్నాను." అంది జయ కల్పన కౌగిలిలో కరిగిపోయి ఏడుస్తు.

"మనిద్దరి జీవితాలతో ఆటలాడిన విధిపైన,మనం ఇలాఅవడానికి కారణం అయిన సమాజం పైన కక్ష సాధిస్తానుఅందిజయ.

"పిచ్చిదానా. ఈ అక్కే ఏమి చేయలేక పోయింది. అమాయకురాలివి. నువ్వేం చేయగలవు. పంజా విప్పి దెబ్బ కొట్టడానికి ఎదురు చూసే పులిని ఎదుర్కోగలవా? పడగవిప్పి

బసలు కొడుతూ కాటు వేయడానికి సిద్ధంగా వున్న తాచుపాముని కొట్టగలవా, మనం అప్రాయిల్ అడపిలలం!" అంది కల్పన.

"శీలం పోనంత వరకే ఆ ది నేను అడదాన్ని అని భయ పడేది. అదిపోయాక ఆ ది ఆడదేకాదు. ఏం చేయడానికైనా ఓ మొండి ధైర్యం వస్తుంది" అంది.

కల్పన నవ్వింది.

జయని కూడా తనతోపాటు కేబరేకి తీసుకెళ్ళింది కల్పన. ముందు మనసంగీకరించకపోయినా కల్పనని చూసి ఆ జీవితానికి అలవాటు పడ్డం నేర్చుకొంది జయ. జయ కూడా కేబరే చేస్తోంది. నెల రోజుల్లో ఓ కారు కొన్నారు. ఇంటికి ఫోన్ అన్ని సదుపా యాలూ వున్నాయి ఇప్పుడు.

వాళ్ళిష్టమైతే తప్ప ఆ యింట్లో అడుగుపెట్టడానికి ఎవరికీ ఆస్కారంలేదు.

ఖరీదైన మనుషు స్నేహం, ఆదరణ, అన్నింటికంటే డబ్బు....ఏదికావాలనుకొంటే అదిక్షణాల్లో ఏర్పాటు అవుతున్నాయి.

వాళ్ళు ఖరీదైన బంగళాలో వ్యభిచారాన్ని సాగిస్తున్నా కూడా ప్రసాదు వస్తూనే వున్నాడు.

అతని గుండెల్లో కల్పనపై గల ప్రేమ చెరిగిపోలేదు. పరి స్థితులని బాగా అకళింపు చేసుకోడంచేత జాలిని పోగొట్టుకోలేదు. ఎవరేమనుకున్నా లెక్కలేదన్నట్లుగా ఆ ఇంట్లో అతను సంచ రిస్తూనే వున్నాడు.

"మమ్మల్ని చూస్తే నీకు అసహ్యం వేయడంలేదూ!"

ఓసారి కల్పన అడిగింది.

"పరిస్థితులకి మనిషెప్పుడూ బానిసే కల్పనా! నేను మీతో మొదటిసారి స్నేహం చేసినపుడు మీరిద్దరూ మంచిముత్యాలేనని నాకు తెలుసు. నేను కాస్త తొందరపడి వుంటే నీ పరిస్థితి ఇలా మారేదికాదని నాకు తెలుసు. ఒక్కోసారి అనుకొంటాను—ఇది పాపమేకానీ, పుణ్యమేకానీ - ఇందులో నాకూ భాగముందని. ఈ రోజుకి నీపైన నా ప్రేమ చావలేదు- చావదు. నువ్వు నాగుండె ల్లోనే వున్నావు. అది ఏదేకాదు, ఎప్పటికీ అంతే!"

"నువ్వు మనిషివో, దేవుడివో నాకు అర్థంకావడంలేదు

ప్రసాద్. ప్రతి మగవాడి మనసు నీ మనసులాంటిదైతే అద వాళ్ళెంత అదృష్టవంతులు!"

ప్రసాద్ మాట్లాడలేదు.

"జయ డాన్స్ ప్రోగ్రాం ఏర్పాటు చేస్తున్నాను" అంది కల్పన.

"ఇప్పుడు డబ్బు అవసరంలేదుగా."

"డబ్బుకోసం కాదు. ఆ కళామూర్తిలోని కళని తిలకించే అవకాశాన్ని ప్రేక్షకులకి ఓసారివ్వాలని, అదంతా నువ్వే చూసుకోవాలి" అంది.

"అలాగే!" అన్నాడు ప్రసాదు.

"నీ మంచి నమ్ముతున్నా. మాటలన్నీ అందుకున్నా. ఎప్పుడూ ఓడిపోతాను. నీ ఒడిలో పడుకొని, నీ కళ్ళలోకి చూస్తూ ప్రాణాలొదిలేయాలన్న ఓ చిన్నికోరిక ఎప్పుడూ మనసులో లీలగా కదులుతుంటే అనిపిస్తుందికదా, ఎన్నో తమ్మెదలు వాలి పీల్చి పిప్పి చేసినా నీకెందుకో ఇంకా 'ఆశ' అని" అంది బాధగా కల్పన.

ప్రసాద్ భారంగా అడుగులేస్తూ అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

కల్పన బరువుగా వూపిరి తీసుకుంది.

* * *

చాలారోజుల తర్వాత కాలికి తిరిగి గజ్జెలు కడుతుంటే, మనసు ఉత్సాహంతో ఉరకలు వేసింది జయకి.

అందెల రవళికి గుండెలు ఝల్లుమన్నాయి.

కిక్కిరిసిన ప్రేక్షకులతో ఆడిటోరియం నిండిపోయింది. చాలా రోజుల వ్యవధి తర్వాత జయ నాట్యప్రదర్శన అనేసరికి ప్రేక్షకులు చాలా ఉత్సాహంగా వచ్చారు.

రెండు గంటలపాటు ఏకధాటిగా జయ నాట్యప్రదర్శన సాగింది. కరతాళ ధ్వనులు మిన్నుముట్టగా జయ గర్వంగా చూసింది. కల్పన జయని కౌగలించుకుని ముద్దుపెట్టుకొంది.

ఘల్లు ఘల్లుమని మువ్వలు చేస్తున్న చప్పుడుతో గ్రీన్‌రూం వేపు కదలబోతూ ఎదురుగా నించున్న మనిషిని చూసి నిర్ఘాంతపోయింది.

"అదే మనిషి అదే చూపు, అదే నవ్వు........"

"మధూ మ....ధూ...."

అతను చేతులు చాచాడు. జయ సంభ్రమంగా రెండు అడుగులు వేసింది. ఘల్లుమన్న గజ్జెలు ఏదో హెచ్చరికని చేసినయి. అంతే....ఎవరో పట్టుకొని ఆపినట్టుగా ఆగిపోయింది. మరుక్షణం లోనే అక్కడ్నుంచి పరుగెత్తబోయింది జయ.

మధు జయ చేతులు పట్టుకున్నాడు కన్నీళ్ళతో వదలమన్నట్టు అతన్ని చూసింది. అతని పెదవులపైన నవ్వు అలాగే వుంది. ఆ చూపులో ఆరాధన అలాగే వుంది.

కల్పన వాళ్ళిద్దర్నీ చూసి స్తంభించి పోయింది.

'మధూ బ్రతికే వున్నాడా?' అతను క్షేమంగా తిరిగి వచ్చాడన్న ఆనందం ఓ ప్రక్కన కలిగినా, జయ జీవితంలో తలెత్త బోతున్న కొత్త విషమ సమస్యని తలుచుకొని నీరసపడిపోయింది కల్పన. అనుక్షణం యేదో ఒక వింత పరిస్థితి ఎదురవుతోంది. మెదడు మొద్దుబారిపోయింది.

జయ అతని చేతిలోంచి చేతిని విడిపించుకొని గ్రీన్‌రూమ్ లోకి పరుగుదీసింది. మధూకి జయ ప్రవర్తన అర్థం కాలేదు. మృత్యువుని జయించి తను తిరిగొచ్చిన ఆనందం జయలో కనపడకపోగా ఆ వింత ప్రవర్తన మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది.

మధు సిగరెట్ వెలిగించి లోపలికి నడిచాడు.

జయ వెక్కి వెక్కి యేడుస్తోంది.

"జయా!" అని పిలిచాడు. ఆ పిలుపు కోసం ఎంత ఎదురు చూసిందీ, మరెంతగా తపించి పోయిందీ జయ మరచిపోలేదు.

భుజం మైన చెయ్యివేసి మళ్ళీ పిలిచాడు.

"జయా! నా మీద కోపమా?" అలా అడుగుతుంటే ఆ గొంతులో ఆమె మీద అతనికి గల ప్రేమ ఎంత సుస్థిరమైనదీ, బలమైనదీ తెలుస్తూనే వుంది.

జయ తలెత్తి చూసింది.

కన్నీరు వరదలై ప్రవహిస్తున్న ఆ కాటుక కళ్ళకి మసగ్గా అతను తనకోసం వెదుక్కుంటూ వచ్చిన దేవుడిలా కనబడ్డాడు.

"పద వెళదాం" అన్నాడు.

"నేను....నేను....రాను."

"చచ్చిపోయిన మనిషిని, నీకోసం తిరిగి ప్రాణాల్ని పోసు

కానీ వచ్చాను జయా! నీ ప్రేమే నన్ను బ్రతికించింది. నిన్ను చూడాలన్న కోరికే నన్ను తిరిగి ఇక్కడికి తీసుకొచ్చింది." అతను చెప్పుకు పోతున్నాడు.

జయ అతన్ని తీక్షణంగా చూసింది.

"లేదు, నిన్ను నేను నమ్మను. నువ్వొత్త మోసగాడివి. ఆడపిల్లల మనసుల్లో ఆశలు రేకెత్తించి పారిపోయే వంచకుడివి. నీకు ప్రేమంటే తెలీదు. ప్లీజ్ గెటవుట్!" అరిచింది.

జయ ఎందుకా ప్రంగా ప్రవర్తిస్తుందీ మాధవ్‌కి అర్థం కాలేదు. మధు పెదవులపైన ఓ నవ్వు తేలిపోయింది. ఆ నవ్వుకి ఏ అర్థమైనా కావచ్చు. కానీ జయ గుండెని మాత్రం పిండేసింది.

మాధవ్ అక్కడ్నుంచి బయటికి కదిలాడు. అతను బయటికి వెళ్ళాడో లేదో-తలని టేబిల్ పైన తపతపమని కొట్టుకుంది జయ.

ప్రసాదు, కల్పన వారించబోతే అన్నది.

ఆ మనిషినే అనవల్సిన మాటలేనా అవి! ఎన్ని కష్టాలనో సహించి, ఎరెన్నో బాధలకి తట్టుకొని, సముద్రాలు దాటి, అడవులు దాటి, గుట్టలు, పుట్టలుదాటి నా కోసం వచ్చాడని నాకు తెలీదా? కానీ, కానీ నేనతనికి తగినదాన్ని కాదు. అందుకే అతని మనసువిరిగిపోవాలనేఅలా మాట్లాడాను."అంటూయేడుస్తోందిజయ.

"పద మనం వెళ్దాం" అన్నది కల్పన.

అప్పటికే అందరూ వెళ్ళిపోయారు.

వాళ్ళు ముగ్గురు బయటకొచ్చి కారు ఎక్కబోతుండగా మాధవ్ కారు చాటునించిచటుక్కున వచ్చి జయ చేతిని పట్టుకున్నాడు. జయ విడిపించుకోవాలని శతవిధాల ప్రయత్నం చేసింది. మాధవ్‌ది సామాన్యమైన చెయ్యి కాదు. కొండల్ని పిండిం చేయగల ఓ మిలటరీ ఆఫీసరు అతను. అలాంటివాడి చేతిలోంచి ఓ ఆడపిల్ల ఎలా తప్పించుకోగలదు? మాధవ్ రెండు చేతుల్తోనూ ఓ బొమ్మని పట్టుకున్నట్టు పట్టుకొని పక్కనే వున్న కారులోకి తోసి కారెక్కి స్టార్టు చేశాడు.

కల్పనా, ప్రసాదు చూస్తూ వూరుకున్నారే తప్ప యే విధంగానూ అడ్డలేదు.

సమస్యని వాళ్ళే పరిష్కరించుకొంటే మంచిదన్న అభి

ప్రాయానికి వచ్చారు వాళ్ళిద్దరు.

"కారు ఆపు. లేకపోతే దూకేస్తాను," అరిచింది జయ. మధు మాట్లాడలేదు. విండ్‌స్క్రీన్ లోంచి రోడ్డు మీదకి చూస్తూ కారు పోనిస్తున్నాడు. ఒక చేతితో స్టీరింగ్, మరో చేత్తో జయని పట్టుకున్నాడు.

"ప్లీజ్ నన్నొదిలేయ్. నన్ను చంపకు మధూ!" అతని భుజంపైన తల వాల్చేసింది. ఏడుస్తోంది.

"నేను చచ్చిపోతాను నాకీ బ్రతుకొద్దు,"

"నీ మొహం నేను చూళ్ళేను, నన్ను ఒదిలిపెట్టు" కారు ఆగింది. జయని చేతుల్తో ఎత్తుకొని ఇంట్లోకి తీసుకొచ్చాడు మధు.

శాంతమ్మ కంగారుగా సోఫాలోంచి లేచి,

"ఏమిట్రా ఇది?" అంది.

జయని తల్లివైపు తోశాడు మధు.

"నీ కోడలికి అతితెలివి ఎక్కువయింది. కాస్త మందలించు" అంటూ విసురుగా మేడపైకి వెళ్ళిపోయాడతను.

"అత్తయ్యా...." అంటూ శాంతమ్మ కాళ్ళదగ్గిర జారిపోయింది జయ.

"లే తల్లీ, లే. ఇంతకాలానికి బాబు తిరిగొచ్చాడంటే అది నీ అదృష్టమే అనుకున్నాను. నీకేంకావాలో చెప్పు, ఏడవకు"అంది.

"ఈ దేవాలయంలో అడుగుపెట్టేఅర్హత నాకు లేదత్తయ్యా. ఈ భ్రష్టురాలిని చంపేయండి అత్తయ్యా!"

"నీకొచ్చిన భయంలేదు. ఈ అత్తయ్య బ్రతికుండగా నీకే భయమూ అవసరంలేదు. చెప్పమ్మా" అంది శాంతమ్మ.

జయ తలెత్తి ఆమె ముఖంలోకి చూసింది. సాక్షాత్తూ పార్వతీదేవిలా జయ కళ్ళకి ఆవిడ గోచరించింది. రెండుచేతులూ ఎత్తి నమస్కరించింది ఆమెకి జయ.

"చెప్తాను, అంతా చెప్తాను. మధూ కోసం....అతని సుఖం కోసం నేనేమైనా పర్లేదు. అత్తయ్యా....నేను భ్రష్టురాలివి. గండు తుమ్మెదలు పీల్చి పిప్పిచేసిన పువ్వుని నేను."

జయకి ఆవేశం ముంచుకొచ్చింది. ఆవేదనకి కట్టలు తెగింది. గుండెలు పగిలిపోయే ఆ క్షణంలో జయ శాంతమ్మకి అంతా చెప్పింది. అలిసిపోయింది. బాధ, భరించరాని బాధ. ఆవిడకి చెప్పుకొన్న తర్వాత కాస్త ఊరటని కలిగించినా, వళ్ళు తేలిపోయింది. అయినా ఆమె ఒడిలో మొహం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

శాంతమ్మ చకితురాలయింది. జయ నోటి నుండి విన్న నిజాలు గుండెని పిండినా, జీవితాన్ని బాగా అవగాహన చేసుకొని వడగొట్టిన ఆ తల్లి గట్టిగా నిట్టూర్చింది. జయ తలపైన చేత్తో ఆప్యాయంగా నిమిరింది.

"జయా, లేమ్మా," అంది శాంతంగా. ఆ పిలుపులో యేదో ఓ ఖచ్చితమైన నిర్ణయం ధ్వనించింది.

జయ లేవలేదు. తలెత్తి ఆ తల్లి మొహంలోకి చూడాలంటే భయపడింది. ఆ చూపులకి తట్టుకోలేక చేసిన తప్పులకి మాడి మసైపోతానేమో ననుకొంది.

"ఎంతటి వాళ్ళయినా విధికి తలొంచక తప్పదమ్మా. కాకతాళీయంగా జరిగిపోయిన ప్రతి సంఘటనా, నీ జీవితంలో ఒక తుఫానుని రేకెత్తించినమాట వాస్తవం. దానికి నువ్వెంత వరకు బాధ్యురాలివి అన్న ప్రశ్న వేసుకుంటే సమాధానం కేవలం నువ్వో నిమిత్తురాలివి. నీ ప్రమేయం లేకుండా జరిగిపోయిన అన్యాయాలకి నిన్ను దోషిగా భావించడానికి యే విధమైన ఆస్కారమూ లేదమ్మా!"

జయ ఆవిడ మాటలకి తలెత్తి చూసింది.

నా తప్పు లేదంటున్నారా! నేను పాపిని కాదంటున్నారా అత్తయ్యా!"

శాంతమ్మ ప్రేమగా నవ్వింది.

"నువ్వు పుట్టినప్పుడు మొదటిసారిగా నిన్నెత్తుకుంది ఈ అత్తయ్య. నీకు ఊహ తెలిసేవరకూ ఈ అత్తయ్య దగ్గరే పెరి

గాదు. గుర్తులేదూ....ఇలా జరగడానికి పరోక్షంగా నా బిడ్డ, ఏ మధూ కారణం....అని నేనంటున్నాను."

"అత్తయ్యా!"

"నా బిడ్డకి నువ్వే తగినదానివమ్మా!"

"లేదు, లేదు. ఆ మాట నేను భరించలేను. అతన్నివంచించలేను. నా ప్రాణం పోయినా పరవాలేదు. మధూ జీవితం నాశనం కాకూడదు."

శాంతమ్మ గంభీరంగా అన్నది.

"నా బిడ్డ మనిషి కాదమ్మా, దేవుడు. పరిస్థితులని అర్థం చేసుకోలేనంత మూర్ఖుడు కాదు. దేశరక్షణ కోసం ఏ క్షణంలోనైనా ప్రాణాల్ని త్యాగం చేయడానికి సిద్ధపడే త్యాగశీలి నా బిడ్డ. నీవేమి దాయకుండా నీ మనసు కడిగేసుకున్నావు. ఇప్పుడు మధూ నీ మనిషి. వాడు నిన్ను వదులుకోడు. నీకా భయం అవసరంలేదు."

"వద్దత్తయ్యా! నా మనస్సాక్షి అందుకు అంగీకరించడం లేదు. మధు జీవితంలో ప్రవేశించకపోయినా, అతను నావాడు అన్న తృప్తి నాకు చాలు. అతనెక్కడున్నా సుఖశాంతులతో వుంటే అదే నాకు పది లక్షలు. ఈ దౌర్భాగ్యురాలి జీవితంతో ముడిపెట్టుకుని అతను నరకం అనుభవించడం నేను చూస్తూను భరించలేను."

"జీవితం అశాశ్వతమైనది. దేన్ని మనం ఆశించినా కేవలం ఈ వూపిరి వున్నంతవరకే. నా కొడుకు నువ్వనుకొనే మామూలు మనిషి కాదు. పోనీ, ఓ నిర్భాగ్యురాలి జీవితాన్ని సంస్కరించిన తృప్తినయినా వాడికి కలగనీయి."

జయ మాట్లాడలేదు. ఆలోచనలు కత్తుల్లా పొడుస్తున్నాయి.

"నేను అబ్బాయితో మాట్లాడతాను, నువ్వు భయపడకు. మధు నీవాడు" అని లేచి లోపలికెళ్ళింది శాంతమ్మ.

జయ ఓ నిశ్చయానికి వచ్చింది.

ఇప్పుడు ఆమెకి భయంలేదు.

బాధ, ఆవేదనా అన్నీ ఒక్కసారిగా పటాపంచలయినయి. టేబిల్ పైనున్న కారు 'కీస్' తీసుకుంది. స్థిరచిత్తంతో బయట కొచ్చింది. కారెక్కి స్టార్ట్ చేసింది.

వది నిముషాల్లో బంజారా హిల్స్‌లో తనుండే ఇంటిముందు కారు ఆపి దిగింది.

హాలులో ప్రసాదు, కల్పన కూర్చొని వున్నారు. వాళ్ళని చూసి ఓ చిరునవ్వు నవ్వి జయ లోపలికి నడిచింది.

ప్రసాదు కల్పన మొహ మొహాలు చూసుకున్నారు.

జయ గదిలోకి వచ్చింది. అద్దంలో చూసుకొంది. ఇంకా మేకప్‌లోనే వుంది తను. బాగా ఏడవడం చేత కళ్ళు బాగా ఉబ్బినయి. రంగు వేసుకున్న మొహానా కన్నీటి చారలు తన జీవితంలో పడిన మచ్చల్లా కనిపించినయి.

డ్రాయరులోంచి నిద్రమాత్రల సీసా తీసింది కూజాలోని నీళ్ళనిగ్లాసులోకివంపుకొని సీసాలోని మాత్రలన్నీ వేసుకొని 'ళ్ళ' తాగింది.ఎన్నో బాధల్ని, కష్టాల్ని ప్రతిక్షణం ఎదుర్కొని చివరికి తను సాధించబోతున్న విజయం ఇది. విజయం తనదే. తను ఓడిపోలేదు. దేనికోసం తనింత కాలం ఎందుకు ఎదురు చూసినట్టు? ఎందుకు ఆగినట్టు?

శరీరంలో యేదో నిశ్చత్తువ చోటు చేసుకుంటోంది. చెమట్లు వదుతున్నాయి.

ఎదురుగా నటరాజు విగ్రహం కనపడింది. తూలుతూ ఆ విగ్రహం ముందుకి నడిచింది. కాలికున్న గజ్జెలుఅపశృతిపలికేయి.

"నటరాజా,....మేడమ్ నీ కంకితం చేసిన ఈ జీవితాన్ని నేను మరొకరికి అంకితం చేసుకోవాలనుకున్న స్వార్థపరురాలిని. అందుకు నువ్వు నాకు విధించిన శిక్ష ఇది. కరువుతీరా యేడ్వాలని వుంది. కాని కన్నీరే రావడం లేదు. వస్తే అది మరో గోదావరి అయ్యేది.....!"

విగ్రహానికి ఎదురుగా కాళ్ళు వెనక్కి మడిచి రెండుచేతుల్ని నేల పైన ముందుకి వేసింది.

"జీవితం నాపాలిట శాపమయింది. ఓ పీడకలగా అంతా ముగిసిపోతోంది, ఈ పాపిని క్షమించు. కొన్ని క్షణాల్లో యీ

వబంధాలనించి పూర్తిగా విముక్తిపొంది నీ వన్నిధి చేరాలన్న
ళ...." కాలి గజ్జెలని విప్పింది. అపురూపంగా వాటిని ఓసారి హృదయానికి హత్తుకొంది. కళ్ళనించి జారిన కన్నీటి బొట్లు ఆ ుందెలపైన పడినయి. వణుకుతోన్న చేతుల్తో ఆ గజ్జెలని నటరాజు ముందు వుంచింది. మెల్లగా వంగి శిరస్సుని వాటిపైన పెట్టింది.

"జయా!"

ఆ పిలుపు ఎవరిదో జయకి తెలుసు. గుండెల్లో గంటలు మోగాయి. ఆఖరి క్షణాల్లో తన దేవుడు తనని వెదుక్కుంటూ వచ్చాడు. తన తప్పులని క్షమించాడు. అంతకంటే తనకేం కావాలి? మెల్లగా తలెత్తి చూసింది.

మధూ,వెనకగా శాంతమ్మ, కల్పనా, ప్రసాదు....అందరూవున్నారు.

అంతకంటే తనకేం కావాలి?

మధు జయని ఒడిలోకి తీసుకున్నాడు.

"ఏమిటిది. నువ్వు నన్ను అర్థంచేసుకుంది ఇంతేనా జయా! ప్రాణాలని నీ గుండెల్లో దాస్తున్నానని చెప్పాను. నే నెక్కున్నా తిరిగొస్తానన్న నమ్మకం నీకు లేకపోయిందా?"

జయ పెదవులపైన సజావుగా తేలిపోయిందో నవ్వు.

నువ్వెప్పుడూ నా గుండెల్లోనే వున్నావు మధూ. ఆఖరికి, నా ఆఖరి క్షణాల్లో నీ చేతుల్లో కడతేరిపోతున్నాను. నాకు అంతకంటే ఏం కావాలి"

అందరి గుండెలు ఝల్లుమన్నాయి ఆ మాటలకి.

"హాస్పిటల్‌కి తీసుకు వెళదాం" అన్నాడు ప్రసాదు ంగారుగా.

"నే నెలాగూ బ్రతకను. నన్ను అల్లరి పెట్టకండి. మధూ.........మధూ........."

మధు కన్నీళ్లు వరదలు కాగా, జయని రెండు చేతుల్తో తీసి గుండెలకి హత్తుకున్నాడు. జయ కోరికని తెలుసుకున్న ఎలా ఆమె నుదుట ముద్దుపెట్టుకొన్నాడు.

జయ చూపు వధు మీద నిలిచిపోయింది.

ఐ. ణం తీరిపోయింది.

శాంతమ్మ బావురుమంది. కల్పన వెర్రిగా చూసింది. విరుచు కొని జయ కాళ్ళపైన పడిపోయి రోదిస్తోంది కల్పన.

ప్రసాదు కళ్ళనించి జారిన కన్నీరు జయ పాదాలని అభిషేకిస్తోంది. ఒక నర్తకికి, ఓ కళాకారిణికి, ఒక ప్రేమమూర్తికి జరిగిన అన్యాయానికి ఏ విధమైన తీర్పునీ ఇవ్వలేని నటరాజు సిగ్గుతో తలొంచుకున్నాడు.

## సమాప్తం

## కృతజ్ఞతలు

'గోదావరి నా కన్నీరు' నవల రాయడానికి నాకు కొన్ని సలహాల నిచ్చిన మిత్రుడు శ్రీ సికరాజుగారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

— రచయిత

## అంకితం

అమ్మ శ్రీమతి చందు అన్నపూర్ణమ్మగారికి ప్రేమతో

మీ

అ॥



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M145 |
| పుస్తకం పేరు | స్వాతి ముత్యాలు |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumithra |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Y.V. Bhanu Sree |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | [illegible] |